# NEETI KADHANIDHANAM

## PART I

BY

V. B. G. SATYANARAYANA SARMA.



*Publishers:*

**KAMALAKARA & Co.,**

**BOOK-SELLERS AND PUBLISHERS,**

**NANDIGAMA, Kistna Dt.**

1932



[ PRICE AS. 12.

# నీతికథానిధానము

గ్రంథకర్త:

బాలకవి, గుడిపాటి సత్యనారాయణశాస్త్రి,

గరికెపాడు అగ్రహారము, సత్తెనపల్లి తాలూకా.



ప్రకాశకులు

కమలాకర అండ్ కో,

బుక్ సెల్లర్సు & పబ్లిషర్సు, [illegible]



ముద్రాపకులు:

కె. [illegible]

అంధ్రగ్రంథమాలా ముద్రాక్షరశాల, బెజవాడ.

1932.

 [ [illegible] అ. 12.

# కృతిసమర్పణము.



భగవంతుండగు పరాశరునిగోత్రంబున గుడిపాటి వంశాభరణమై పాలవెల్లినుండి చలువలఱేఁ డుదయించిన భాతిఁ గనవరా జుద్భవించె. అతని వంశవృక్షఫలమై బుద్ధిమదగ్రేసరుం డగు వేంకటప్పయామాత్యుండు వెలసి హారితసగోత్రోద్భవుండగు రాయసము పెదకోట యాఖ్య ప్రథమపుత్త్రిక యగు సుబ్బమాంబికం బరిణయమాడి యా సుగుణవతియందు వేంకట సుబ్బాయమ్మ పేరమ్మ లను వినయవతులగు దుహితలను జగన్నాథరావు, సత్యనారాయణ, నాగభూషణము లను విధేయులగు తనయులను బడసి యాత్మజు లయిదుగుర శ్రేయఃపరంపరలఁ గనఁజేసిన యస్మజ్జనకు నాత్మశాంతికై ద్వితీయపుత్త్రుఁడ నగు నే నీ నీతికథానిధానము గృతి నొసంగితి.

సత్యనారాయణ,

కృతిపరిణేత.



# తొలిపలుఁకు.

ఈ నీతికథానిధాన మను చిన్నిపొత్తము ప్రాశస్త్యముచే నొప్పుచున్నది. ఇందున్న కథలు ఆర్యసాంప్రదాయములను, హిందూమతధర్మములను బాలురకు అవగతము చేయుచు, ఉదారభావములను ప్రకటించుచు, ఉత్కృష్టములైన నీతులను బోధించుచున్నవి. భాష లక్షణసిద్ధము. శైలి నాతికఠినము. సమానార్థకపదములు విరివిగ వాడఁబడినవి. కనుక ఈ గ్రంథపఠనము బాలురకు భాషాజ్ఞానము నలవరుచుటకు ఎంతేని తోడ్పడు నని నావిశ్వాసము. కనుక దీనికిఁ దగిన ఆదరణమును ఒసఁగి—ఈ బాలకవిని "అధునాతన ప్రసంగము"లను వ్యాసరూపమున విరివిగ రచించి పఠనీయ గ్రంథములఁ బ్రచురించునటుల సహృదయులెల్లరు ప్రోత్సహింతురుగాక.

Masulipatam,<br>16-6-1932.

(Sd) Ch. S. PRAKASA RAO,<br>*Retired Dt. Educational officer.*

# పండితాభిప్రాయములు.

**శ్రీయుత శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, కడియము.**

"అయ్యా!

"నీతికథానిధానము" అను మీపొత్తము నేఁడే చేరినది. అక్కడక్కడ చదివి చూచినాఁడను. రమ్యమైన శైలి నిర్దుష్టమైన భాష కలదియై భాషాభ్యాసకులకు పాఠశాలావిద్యార్థుల కుపకారకముగాఁ గనుపట్టుచున్నది. విద్యాశాఖవారు దీనిని యథార్హముగా గౌరవింతురని నావిశ్వాసము. గ్రహింపుఁడు."

---

**ఆశుకవిచక్రవర్తులు శతావధానులు శ్రీయుత కొప్పరపు సోదరకవులు, కొప్పరము.**

"శ్రీ గుడిపాటి సత్యనారాయణ శర్మగారు రచించి పంపిన "నీతికథానిధానము" అను పొత్తము స్థాలీపులాకన్యాయముగాఁ జూచితిమి. చదివిన విషయములను బట్టి తక్కినవిషయములును ఇట్లే సముచితములుగ నుండకపోవని నమ్మిక. ఇది హైస్కూలు 4, 5, 6 ఫారముల విద్యార్థులకుఁ బఠనీయ గ్రంథముగ నుపయోగపడవచ్చును. కమిటీవారు ఇట్టి పొత్తములు స్వీకరించి యిట్టిబాలకవులు ప్రౌఢకవులుగా వృద్ధినొందుటకుఁ బ్రోత్సహించి భాషావృద్ధికరు లగుదురుగాక!"

---

**శ్రీయుత ముదిగొండ వేంకటరామశాస్త్రిగారు, తర్క-వేదాంతోపన్యాసకులు, చౌటపాపయపాలెము.**

"శ్రీ చి॥ మామిత్రుఁడు బాలకవి గుడిపాటి సత్యనారాయణశర్మకు, ముదిగొండ వేంకటరామశాస్త్రి జయోధికశ్రీయోభివృద్ధిగా నాశీర్వదించి వ్రాయునది యేమనగా- నీ "నీతికథానిధానము" 1-5-32 తేదీనను నాకుఁ జేరినదిగాని నేను ప్రస్తుతము ఓంకారమందిరనిర్మాణక్రియములో నుండుటచే

నామూలాగ్రముగ నీపొత్తమును జూడ నవకాశము లేకపోయినను స్థాలీపులాకన్యాయముగా నాయాతో మిత్రదిప్రకరణములఁ జూచితిని. అందుపై నాయభిప్రాయము లేవియన—

1. <u>రచనాపద్ధతి</u> -గ్రాంథికము, వ్యాకరణ సంధ్యాది నిబద్ధముగా నున్నది.

2. <u>భాషాశైలి</u>- ఏకైకార్థమం దన్యోన్యవ్యాఖ్యారూపముగా ననేక సామాన్యవిశేష నైఘంటికవిజాతీయశబ్దసనాథమై ఒకశబ్దమున కర్థము దుర్గమముగాఁ దోఁచినంతనే సర్వసాధారణసాధారణశబ్దాంతరముచే నాయర్థమే సుగమ మగుచుండుటచే నత్యంతబుద్ధివికాసజనకముగా నున్నది.

3. <u>కథాభాగలు</u>- పాఠకజనాకర్షకములుగాను సద్ధర్మరూపకములుగాను నున్నవి.

4. పైకారణములఁబట్టియు, నింక ననేక సూక్ష్మహేతువులఁబట్టియు నీ "నీతికథానిధానము" బాలవ్యుత్పాదక మగుటచే 4, 5, 6 ఫారములకుఁ బఠనీయగ్రంథముగా విద్యాశాఖవారు గ్రహించిన బాగుండు నని తోఁచుచున్నది.

5. ఇతఃపూర్వము నిన్ను నామిత్రునిగ మాత్రమే గుర్తెఱిఁగితిని. ఇఁక నుండి "బాలకవి" యనికూడ గుర్తించి యానందించుచుండెద. ఇంతే అనేకాశీర్వాదములు."

---

## శ్రీయుతములుగు వీరభద్రశాస్త్రిగారు, ప్రధానాంధ్రోపాధ్యాయులు, బోర్డుహైస్కూలు, జగ్గయ్యపేట.

"శిష్యా!

నీచే రచింపఁబడిన "నీతికథానిధానము"ను నామూలాగ్రముగఁ జూచితి. నీ పొత్తమునందలి భావ రసోచితమై సలక్షణమై నాతికఠినపద భూయిష్టమై పూర్వరచనల ననుకరింపుచున్నది. కథలు వింత వింత కల్పనలు గలవి. ఆంధ్రభాషయందుఁ జిన్ననాటఁగోలె నీకుఁగల ప్రేమను "కదళీపాక

ము" నీ గ్రంథమును వ్రాసి "వ్యాసరచనాప్రవీణ" అను బిరుదమును సార్థక మొనర్చుకొంటివి. గ్రంథముమూలమున నాంధ్రబాలురకెల్లరకును మాతృభాష నభివృద్ధి జేసికొని నీతిపథంబున నడుచుఁ ద్రోవఁజూపితివి. ఆంధ్రభాష నాదరించెడి యిక్కాలమున యీయుష్మద్రచితము లగు చిత్రకథ లెంతయు నాదరణీయము లని చెప్పవలెనా? ప్రతికథను నీతిని వ్రాసి కథాభాగమును సొంపుగ బయలుపెట్టితివి. నీ యీ గ్రంథము 5, 6 ఫారముల విద్యార్థుల కుపవాచకముగ విద్యాశాఖవా రంగీకరించి పాఠకుల కెక్కుడు పరిజ్ఞానము గలిగింతు రని నే నాశించెద. ఆధునికకవులెల్లరు "బాలకవి" వగు నిన్నున్నతపదవికిఁ దెచ్చెదరుగాక!

వత్సా! ఏతాదృశసత్కృతుల ననేకములు వ్రాసి పెద్దల గౌరవము నకుఁ బాత్రుఁడవై వాగ్దేవీకటాక్షమున గుడిపాటివంశమౌక్తికమ వని వన్నె కెక్కుదువుగాక యని కోరుచుఁ బరమేశ్వరునికృపచేఁ బరిపూర్ణాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులఁ బడయుదువు గాత మని నా శుభాశీర్వాదము!"

---

## శ్రీయుత నాగపూడి కుప్పుస్వామయ్యగారు, తిరుపతి.

"అయ్యా!

మీ రంపిన పుస్తకము నందందుఁ జూచితి. శైలి సరళముగాను హైస్కూలుతరగతులలో బాల్యగ్రంథముగా నిర్ణయింపఁదగినదిగా నున్నది..."

---

## శ్రీయుత శేషాద్రిరమణకవులు, శతావధానులు, ఆంధ్రోపన్యాసకులు, ఉస్మానియాకాలేజి, హనుమకొండ.

"ఆర్య!

తాము దయతో నంపిన "నీతికథానిధానము" సాకల్యముగఁ జదివితిమి. ఉన్నత తరగతులలోఁ జదువు బాలుర కీపొత్తము అన్నివిధములఁ దగి యున్నది. కథలు సముచితకల్పనలతోడను మనోహరము లగు వర్ణనముల తోడను నిరర్గళసరసశైలితోడను నలరారుచున్నవి. బాలురకు మీ "నీతి

కథానిధానము"వలన నైతికజీవిత మలవడుటయేగాక సలక్షణమగు నాంధ్ర
పయింగూడ నభిమాన మేర్పడునని మే మాశించెదము. మీ ప్రథమప్రయత్నమే
ఇంతయోగ్యముగ నుంటచే భవిష్యత్రచనము ఆంధ్రవాఙ్మయమునకు నూత్న
శోభ గూర్చు ననుటకు సంశయములేదు."

---

## శ్రీయుత "మహోపాధ్యాయ" ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు, తెనాలి.

"ఆర్యా!

మీ రచించిన "నీతికథానిధానము"ను జాలవరకుఁ జదివితిని. దీనిశైలి
మృదుమధురముగా నున్నది. ఇందలి చిత్రకథలు నీతిబోధక మనుట యథా
ర్థము. కల్పన చిత్రమైనది. కావున నీగ్రంథము హైస్కూలు బాలురకు జ్ఞాన
దాయక మని నేను నమ్ముచున్నాను."

---

## శ్రీమాన్ శతావధాని సంపన్మూడుంబ సింగరాచార్యులుగారు, జగ్గయ్యపేట.

"మహారాజశ్రీ గుడిపాటి సత్యనారాయణశర్మగారిచే రచింపఁబడిన
"నీతికథానిధానము"ను స్థాలీపులాకన్యాయముగా నందందుఁ బరిశీలించితిని.
శైలి నాతికఠినమై మృదుపదభూయిష్టమై యొప్పుచున్నది. ఇందలి కథలు జన
సామాన్యమునకు, నందును ముఖ్యముగా విద్యార్థులకు నీతిని గఱపునవియై
యున్నవి. ఇట్లే యింకముందును నీగ్రంథకర్తగారు నీతిబోధకములైన చక్కని
గ్రంథములను రచియించుటకు నాంధ్రమహాజనులందఱును తగిన ప్రోత్సాహ
ము సంగెదరుగాక యని కోరుచున్నాఁడను."

---

### శ్రీమాన్ అవధానిశిరోమణి, కాశీ కృష్ణాచార్యులుగారు, గుంటూరు.

"ఉభయకుశలోపరి. నేను మీ "నీతికథానిధానము" నచ్చటచ్చట చూచితిని. మీరచన కొన్నితరగతులకు పఠనీయగ్రంథముగా నుపయోగింప వచ్చుననియే నాకును దోఁచినది"

### శ్రీయుత "ఆంధ్రవాల్మీకి" వావిలికొలను సుబ్బారావు పంతులుగారు, మదరాసు.

"అయ్యా!

విరామములేని కారణమున గ్రంథమునంతయు చదువలేదు. అక్కడక్కడ కొంచెము చదివినాను. బాగుగనే యున్నది. విద్యార్థులకు మిగుల నుపయోగపడఁగలదు."

---

### శ్రీయుత విద్వాన్ గరిమెళ్ల సోమన్న పంతులుగారు, యం. ఏ., యల్. టి., డిప్యూటీ ఇనస్పెక్టరు ఆఫ్ స్కూల్సు, పెద్దాపురము రేంజి, పెద్దాపురం.

"శ్రీ శర్మగారూ!

మీ "నీతికథానిధానము." ఆదరణీయముగ నున్నది. శైలి యొప్పియున్నది. విషయము వివేకముతోఁ బొందుపఱుపఁబడినది. మీ పుస్తకము పైఫారములకుఁ బెట్టఁదగును. ఇఁక మీరు వ్రాయుపుస్తకములలోఁగూడ కేవల పౌరాణికములేగాక ఇతరములను అగు విషయములను గ్రహింప నగును. కొన్ని క్రొత్త తోవలు తీయవలసియున్నది. మీ పుస్తకమునకు విశాలప్రచారము లభించుంగాక!"

---

*M. R. Ry. J. Venkata Rao Mahasaya, Senior Dy. Inspector of Schools, Jaggayapet Range, Jaggayapet, kindly writes :—*

"From what I have perused of "Nithikadha Nidhanam" written by Mr. G. Satyanarayana Sarma, that this first attempt of the author, at the flowing literary style which may, in apt words, be termed as of 'Kadalipakam type,' is undoubtedly a success

With stories and their titles exclusively his own, this juvenile author had his moral themes based on Puranic literature and lore, intermingling here and there allusions direct from Puranas. I hope, that this publication will be highly appreciated by the type of pandits and scholars who are for the introduction of more of Puranic literature in Andhra Desa.

This book, I believe, is suitable for use as a non-detailed text in the higher forms of Secondary Schools.

" I wish the author every success."



# విజ్ఞప్తి.

**భాషాభిమానులారా!**

శ్రీమంతంబగు నీ భరతఖండమున నీత్రైలింగ్యపయః పారావారమున కనేక రసవత్తరంగిణు లుప్పొంగి వెల్లివిరియుచున్నసంగతి జగద్విదితమే కదా? అందొక్క ధునీప్రవాహంబునకు మద్వచనరచనావిశేషోపనది యొకింత యనువర్తింప వెలువడి సత్సాంగత్యబలమున నిక్కము వన్నెకెక్కునని మదాశయము. మఱియు నా యీ ప్రప్రథమప్రయత్నము శ్రీమద్దేశిక పదపద్మారాధనంబునం జేసియు, సద్గ్రంథపఠనంబునం జేసియు గుణవంతమగునని పండితాఖండరులకు మనవి యొనర్చుట సిద్ధసాధన మనుకొనియెద.

ప్రకృతకాలమం దెన్నియో భాషాగ్రంథము లెన్నెన్నియో రీతుల నెన్నియో శయ్యల నెన్నియో రసముల నా యా భాషాసౌధారోహణములకు సోపానములయి యెల్లర హృదయములతోఁ బాటు మన యాంధ్రబాలుర మనఃపద్మంబులంగూడ నెక్కుడు ప్రకాశింపఁ జేయుచు స్వభాషాగ్రంథములన్నఁ బెనుభూతము లనుభీతిచేతఁ గొందఱును నా యా రచనముల నా యా భాషలయందుంబలె నీ భాషయందు రసగ్రంథము లావిర్భవింప లేదనియుఁ దదాచరణమును కేవల పండితజనైకసాధ్యము కాదనియు ననెడు

పలుకు లాలకించి నే నీ నీతికథానిధానరచనమునకుఁ గడం గితి. ఇం దెట్లు చరితార్థుండ నైతినో రసజ్ఞహంసములు గుణైకతత్పరులై నీరక్షీరవివేచనాపాండిత్యమున రాజ హంసంబు లయ్యెదరు గాత మని నా వేఁడికోలు.

నా యీ నీతికథానిధానము ప్రథమభాగము మధ్యమ పాఠశాల నాలుగైదాఱుఫారముల విద్యార్థులకు పఠనీయ ముగా నుపయోగపడునట్లు విరచింపఁబడినది. శ్రీ శ్రీ శ్రీ విద్యాశాఖాధికారులును పాఠశాల ప్రప్రథమోపాధ్యా యులును పండితోపాధ్యాయులును నీ పొత్తమును పఠనీయ ముగా నంగీకరించి మఱియు నితరభాగముల రచియించు టకు నాకు సంపూర్ణోత్సాహ మొసంగెదరు గాఁత మని సాంజలిఁ బ్రార్థించుచున్నాఁడను.

నా యీ చిన్ని పొత్తమునకు సంపూర్ణానుగ్రహం బునఁ దొలిపలుకు వ్రాసి దయచేసిన మ॥ రా॥ రా॥ శ్రీ చావలి సూర్యప్రకాశరావు పంతులుగారికిని సదభిప్రాయ ములఁ బ్రసాదించిన విద్వచ్ఛిరోమణులకును త్రికరణశుద్ధిగా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాఁడను.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
వ్యాసరచనాప్రవీణ, బాలకవి,
గుడిపాటి సత్యనారాయణశర్మ.
గ్రంథకర్త.

గరికపాడుఅగ్రహారము,
3—5—32.

శ్రీరస్తు.

# విషయసూచిక



పేజీ.







# నీతికథానిధానము.

## I

## సుకృతిప్రతిష్ఠ.

వింధ్యపర్వతప్రాంతమునం గుసుమఫలవృక్షసంతాన కాంతం బగు కాంతారంబు గలదు. అందుఁ 'బుణ్యశాలి' యను విప్రుండు 'దుష్కృతి' యను పడంతితోడఁ గాలముగడఁపుచుండు. ఆ బ్రాహ్మణోత్తముఁడు యథార్థాలాపసంశీలుఁడును సంతతాధ్యయనతత్పరుఁడు నయి యెల్లరికిఁ గరంబు మేలొనర్చు. అతనిభార్య దురహంకారిణియు ననాచారవతుల ప్రోఁకయు దుర్గుణములపుంగయు దుశ్శీలములకు తావును నెల్లకలహంబులకు మూలకందంబును బొంకులకుఁ బుట్టయుఁ బ్రల్లదంబులకుఁ బుట్టినిల్లును గ్రూరత్వమునకుఁ జోటును నై వెలయుచుండెను. మఱియు నాయమ కతిథులన్న నాగ్రహమును నిరుగుపొరుగన్న నింగలముగను భర్త యన్న భైక్షుకుఁడుగను నుండెను.

పుణ్యశాలి తొలిబామునఁ దాఁజేసినదానికయి విరించి తన కట్టి యిల్లాలును బ్రసాదించె నని మనంబునఁ గరంబుఁ

జింతించు. నిర్మలచిత్తుఁడును ధర్మకర్మరతుఁడును నగునావిప్ర
రత్న మనుదినంబును వేఁకువన మేల్కాంచి కాలకృత్యములఁ
జక్కఁబెట్టికొని తనవాసస్థలమునకు మార్గస్థు లేతెంచెడుదారి
నతిథులకొఱకు నిరీక్షించుచుండు. తాఁగన్న బాపనిఁదనగీము
నకుఁ దోడ్కొనిపోయి యుచితాసన నిడి 'ఆర్యా! తమ
నామధేయ మెయ్యది? వాసస్థల మేగ్రామము? ఎటనుండి
యెట కరుఁగుచున్నారలు? ఏయేపుణ్యస్థలముల దర్శించితి'రని
సవినయముగఁ బ్రశ్నించు.

ఒక్కనాఁ డతఁడు భార్యం జేరి 'చెలీ! మనయింటికి నేఁ
డొకవిప్రరత్న మరుగుదెంచినాఁడు. వంటకంబు త్వరితముగఁ
గావలయునుమీ' యనవు డాయమ 'చాలు, కడు బాగుగఁ జెప్పి
నాఁడవు. పనియూ పాటయూ: చేయలేక నే నేడ్చుచుండ నతిథు
లఁట! అభ్యాగతు లఁట! వేకువ కుడిచి కూర్చుండక నీకీ వెఱ్ఱి
యాసపత్యము లేల? నీమాటలు నాకడ సాగనిచ్చెద ననుకొం
టివా? చూడు మిదే యేమిచేసెదనో' యని దూఱుచు, 'నెన
రయ్యా! నీవిట కేల వచ్చితివి? మీకట నెవరు వంటలు చేసి
కుడువఁ బెట్టుటకు! నావలన నాపని గాదు. వెడలుము. "పిల్ల
కాకి కేమి తెలియు నుండేలుదెబ్బ"న్నట్లింటఁ గూరుచుండు మగవారి
కేమి తెలియును? వేళ కింత కుడిచి కూర్చుండక లేనిపోనిబరు
వులనెన్నియో నెత్తినఁ బెట్టుకొందురు' అని యతిథిం గని
యడలనసాగెను.

పాపమా పుణ్యశాలి కర్ణద్వయంబుఁ గరంబు గట్టిగ
మూసికొని శిరంబు వంచుకొని "హరి హరీ! యెంతదారుణ

మెంతదారుణము! సాక్షా త్పరబ్రహ్మస్వరూపుఁ డగు బ్రాహ్మణు నొక్కని గృహమునకుఁ దోడ్తెచ్చిన నసువు లెగిరిపోవునట్లు వాక్రుచ్చెనే. "అభ్యాగత స్స్వయం విష్ణుః" అండ్రుగదా! సవినయముగ స్వగృహమునకుఁ దెచ్చిన పాఱు నే నెట్లంపుదు? ఆహాహా! ఎట్టి విపరీతపుటిల్లాలిని నా కా పద్మగర్భుఁ డనుగ్రహించె! ఏ దేవశ్రేష్ఠుఁ డంబర మను నీలంపుపట్టువస్త్రముపయిఁ దాపడమొనర్చిన వజ్రములరీతిఁ గాంతితో మెఱయు నసంఖ్యాకము లగు నక్షత్ర జాలములమధ్య నొప్పు శశధరునివలె దేవలోకమునంగల యెల్లర కున్నతపదవుల నొసఁగిన పుణ్యమూర్తియో యట్టి నలినాసనుఁడు నా కిట్టి దయిత ననుగ్రహింపనేల? అయ్యో! ధరణీసురోత్తముల కెగ్గుసేయఁ దలపెట్టినవా రెవ్వరిల సుఖ ముండ గలిగిరి? వారలప్రభావములు వర్ణనాతీతములు గదా! అగస్త్యుఁ డను విప్రుఁడు వాతాపి యను రక్కసు నొక్కమ్మసీ మ్రింగి యఱిగించుకొనఁడే! పరశురాముఁ డను భూసురాభరణ మతులితక్రోధమానసంబునఁగాదె రాజ నామమును బోకార్ప సమకట్టి యిరువదియొక్కమాఱు రాజ చూడామణులఁ బరిమార్చుట? సతీ! నీ కింత మూర్ఖత్వ మేలే? విప్రుల కెగ్గాడిన మన కిహపరముల సుఖమున్నదా? గర్వముడిఁగి బుద్ధిశాలినివయి వంటకంబుఁ గావించునది 'యని హితవుగఁ జెప్పెను.

దుర్మదాంధత్వమున నున్న యా మగువ మగని మాటలఁ బెడచెవిం బెట్టి లోని కేగెను. అతిథి కన్నమిడఁజాల

కునికి 'పుణ్యశాలి' పెక్కు తెఱఁగుల వగచెను. కడుచవ్వ నడచివచ్చినయతిథియు నాపెమాటలకాశ్చర్య మగ్నమానసుఁడై 'పడఁతీ! నే ననేకదేశముల సంచరించితిఁగాని నీ యట్టిదానిఁ నెక్కడఁ జూడ నోఁచుకోనైతి. అగ్నిసాక్షిగఁ బెండ్లాడినపతి నావలఁ దోసిపుచ్చితివి. ఇవియా స్త్రీ ధర్మములు? సతికి పతి కన్న వేఱొండు దైవ మున్నదే? శ్రీమన్మహావిష్ణుస్వరూపుఁడగు దశరథరాముఁడు దండకాటవి కేగుతఱి నామహాను భావుపాదపద్మముల ననుసరించిన సాధ్వీమణి యగు సీతయుఁ, బతియె సతికి మూల మని చాటి తమ పవిత్రచరిత్రములచే నగ్నిహోత్రములట్లు పాపపుంజముల భస్మీపటలము సేయు పతివ్రతాశిరోమణులగు సావిత్రి లోపాముద్ర మున్నగు చంద్రాననలు వన్నెకెక్కుట పాతివ్రత్యమహిమవలననేగదా! శాంతమూని ప్రియంబున భర్తతోడఁ గాఁపురంబు సేయు' మని చెప్పి యెందేని వెడలెను.

విప్రోత్తముఁ డగు పుణ్యశాలి, 'యేమి యీచిత్రము? ఎన్ని చెప్పినను వినదయ్యెనే! గృహమున కొక్కనిఁదెచ్చి సత్కరించుట కర్హతలేకుండఁజేసెగా, యాకట్టడి బ్రహ్మ! నేఁ జింతింపనేల? సృష్టిచేష్టలన్నియు నట్టులె యున్నవి. కస్తూరివలెఁ బరిమళము గలిగిన పీణెకు ధగధగలాడు వెలుఁగునియ్యక నేత్రముల కసహ్యముఁ బుట్టించు నలుపురంగును, నసమానమగు సౌరభముచే నెల్ల ప్రపంచము నాకర్షింపఁజేయు పుష్పమున కభిరుచిలేకుండుటను, సర్వాంగల యెల్లలోహముల నుత్కృష్టమగు సువర్ణంబునకుఁ దావిలేకుండుటను, నిలు వెల

మధురమైన చెఱకునకుఁ జివుఱకుఁ బండు నొసంగక వెన్నును గూర్చుటను జూడమా? అటులే నా కిట్టి దుర్మార్గురాలి నంట గట్టె' నని తలపోయుచు చిత్తరువువలె నిలిచెను.

ఒక్కనాఁడు నేలపయి వ్రేలాడెడి జటాభారముతో న్యగ్రోధవృక్షము భంగిఁ గన్పించుచుఁ గోమలములయిన దర్భలతో నొసర్చిన పవిత్రపంచకముతోడి యంగుళీనఖాగ్రములఁ బ్రవాళజపమాలికఁ బూనిభస్మత్రిపుండ్రాంచితఫాలదేశంబును గక్షగతయోగదండంబును గృష్ణాజినో త్తరీయంబును దీపించు చుండఁ బ్రత్యక్షమైనయోగిశ్రేష్ఠు నొక్కనిఁ బుణ్యశాలి కాంచి యబ్బురపడి తనమనమున 'నితఁ డిందుకళాధరుఁడా? కాఁడాతఁడైన నందివాహనమును బినాకమునుండవలెఁగదా? శేషశయనుఁ డని తలంతునా? కాఁడు. గరుడవాహనమును శంఖచక్రము లేడ? లేక పురుషోత్తముఁ డందునా? వెల్లయేనుఁ గుండవలెనుగదా! కాదు కాదు. మానవాకృతితో వచ్చిన నలినాసనుఁడై యుండనోపు. ఇంకఁ దడవు సేయనేల? గృహిణి యింతకుమున్నె జలంబులకయి నూతికి వెడలినది. ఇఁక సందియమేల? ఆగయ్యాళి రాకమున్న నీభూసురాభరణము నిప్పుడె సత్కరించి పంపెద'నని తలఁచి 'ఆర్యా! మునికులతిలకా! లోనికి రండు. మీరాకం జేసి మద్గృహంబు పావనంబయ్యె నానోఁచిననోములు సిద్ధించె. నాజన్మ తరించె. మిమ్ముఁగనుటం జేసి నానేత్రద్వయము సాఫల్యపాత్రం బయ్యె' నని వచింపుడు, నాపరివ్రాజకోత్తముండు, 'గృహమేధీ! నీభక్తికిఁ గడు సంతసించితిమి. వింటివా? నా కొకకోర్కె యయ్యెడు. వారము దిన

నల్లనై కాటుకలు దేరుచుండు నినుమువంటి కర్కశకాయులు భీకరంబు లగు శూలంబులును నాగుబాములవంటి పాశంబులును హస్తముల ధరియించి దుర్మార్గరాలును గఠినచిత్తయుఁ బతిదూషణీయునగు దుష్ప్రేక్షయసువులం గొని కరం బెట్టుఁగాఁ గాలియున్న యినుపకంబములకుఁ గట్టియుఁ బొంగురాఁగాచిన నూనియలో వైచియు దుష్టకట్టెలతో నొడలెల్ల పిఱుఁగఁ గొట్టియు వాఁడివాఁడి సెలచే మేనునెల్ల జెక్కియుఁ బలుతెఱంగుల బాధ లొనరించిరి.

సన్మార్గవర్తియు సకలశాస్త్రవేత్తయు నగు పుణ్యశాలి జీవముల ముష్టఁగపులచేనికడ కిరువురు వేల్పులు రథంబునఁ గొనిపోవుచు నా పుణ్యశాలి భయసంతోషాదులు ముప్పిరిగొనఁ బులకితాంతరంగుం డగుచు సర్వాంగాలింగితోక్త్వతలుండై దండప్రమాణంబు లొనర్ప నా శచీపతి యతనిం గరుణావిస్ఫారితవిలోకనామృతమ్మున సంతర్పితుం జేసెను. మఱియు నా సుత్రాముని యాజ్ఞను శిరంబున ధరించి పుణ్యశాలి తేఁజిగుళ్ళతోడను నిండుఁగూర్చు పుష్పములతోడను గాయలతోడను బలసియున్న రసాలములు మందమారుతంబునకుఁ గదలుచుండ, వానిపయింగల కలకంఠంబులు శుకములు తుమ్మెదలు మధురనాదములు సేయుచుండ వాని వినుచును, శృంగారమగు సరస్సులను జూచుచును నొక్కనాఁడు క్షుత్పీడితుండై యాహారంబు వేఁడిన దేవతలు శోలుపాయ మడఁచి వెడిపాయసముం బోయసమకట్టుడు నా ద్విజుఁడు రోసి, 'అయ్యో? నేఁ జేసిన యపరాధ మెయ్యది?

భూమండలమునం దుజ్జయినీ నగరమునఁ గళావతి యను సౌందర్యవతి కలదు. ఆపగేహమున కొకయోగీశ్వరుండు వెడలి 'భిక్షాం దేహి!' యనవు డాపద్మాక్షి మాటాడక యాతనిరూపాతిశయమున కత్యద్భుతరసనిమగ్న యయి నిలువఁబడియుండ నాతఁ డాయబ్జాక్షితోడ, 'నోగృహిణీ! నే నీగృహమున కేతెంచి యెంత తడవయ్యె? ఇంతవరక నశన మిడక యస్వస్థకృత్యములు సగునే? నా కన్నమిడుట కిష్టము లేదేని యొప్పకున్న వేఱొండు గృహమునకుఁ బోనా? బ్రాహ్మణోత్తములప్రభావములు నీ వెఱుఁగవు కాఁబోలు! ఒక్క భూసురుఁడుగాదె ముల్లోకపాలుఁ డగు నాదివిష్ణుదేవుఱొమ్ము నగులున్నుగ దన్నినది? ఒక్కపాఱుఁడేకదా సప్తసముద్రోదకములఁ గరపుటమునఁ గొని యాచమించినది? అల్పకాల భగవానుం గనఁ బచిన మేకబాపఁడేకదా? బ్రహ్మవిష్ణుమహేశ్వరులఁ బసిపాపలుగ నొనర్చినది బ్రాహ్మణోత్తముని కమండలూదకముగాదే?' యని కోపావేశమునఁ బలుకు నామునిపుంగవుం గని యామచ్చెకంటి వెఱగందిలోని కేఁగి యొక్క మట్టిముద్దను దెచ్చి యామౌనిభిక్షాపాత్రయం దిడ నతఁ డది యాచుకొనకయె యెటకో వెడలెను.

కొంతకాలమున కా లేమ మృతినొందఁ గింకరు లామెప్రాణములఁ గొనివచ్చి, మట్టిముద్దలామెకాహారముగ నిడుచుండ నాసుందరి చూచి వాని భక్షింపనేరక నాపాలి కేతెంచి మొఱలువెట్టి నేఁ డిచిత్రగుప్తుచేఁ గవిలె విప్పించి చూడ నం దాలలనామణి యోగి కిడిన మట్టిముద్దయం దొక యవగింజ

మాత్రి మున్నట్లు కనఁబడఁ దాఁ జేసినకర్మమును ననుభవించిన కూఁడును దా ననుభవింపక తప్పనికతన నెక్కుడుదినములు మట్టిని యొకటి రెండు రోజులు యనశించిని భక్షింపఁజాలక వగచుచున్న, యామెపయి నేఁ గరుణించి 'భూలోకమున జన్మించి సుకృత మార్జించి యీ దుష్కృతకర్మమును నాశ మొనర్చున' దని వచించితి.

ఆమె యవంతీనగరమున 'చంపక' యను నామధేయ మతో నొక బ్రాహ్మణగృహమునఁ బుట్టి స్వకులాచార పరిత్యాగ మొక విప్రునిఁ బరిణయమాడి, ఘట్టనింట వసించు చుండ, నొకయోగిపుంగవుఁ డామెయింటికి భిక్ష మడుగ, నాపె చీకాకువడుచు వెడలుచుండ, నాతఁడు 'ఓ మదిరాక్షీ! నీ కింత గర్వమేల? తొల్లిటిజన్మమున ఘోరపాప మొనరించి తద్దుష్కృతఫలితముగ లభించిన మట్టిఁ దిననోపక దేహ నాథుం బ్రార్థించి, పాపము వాసికొందు నని యిటఁ బుట్టితి; వింకనైన జ్ఞాన మేల పొందవు' అని వచించి వెడవెడఁ బోవుచుండ, నా యోషామణి త్వరత్వరగా నడచి యతనిపదములఁ బట్టి 'స్వామీ! యతిచంద్రమా! నా పాప మెట్లు పోవునో యానతీయరే' యనవు దతఁడు కరుణాళుండయి, 'యంగనా మణీ! నీవు జారకాంతరీతి శృంగార మొనర్చుకొనుచుండ, నెల్ల దేశములఁ గుమ్మరుచుండుము. అట్టి పరమదుర్మార్గులు నీ సౌందర్యాతిశయమున కచ్చెరువంది పలుకీతుల నిన్నుఁ దూలనాడుచుండుదురు. అందువలన నీ పాపమంతయు విచ్ఛిత్తి యగును. వారిని నీవు మఱలఁ దిట్టకుము. అట్లొనర్చుట

వలన సుకృతము నార్జింపఁగలవు. నీ దుష్కృతమెల్లయుఁ దీఱు. పోయిరమ్మని నీతిగఱప, నా సతీమణి యా యతిసత్తముఁడు సెప్పిన చొప్పున నూరూరుఁ దిరుఁగుచుండ నెందఱెందఱో యా యవ్వనసౌందర్యవిలాసముల కోటువడి, నోటికివచ్చినట్లెల్లఁ దూలనాడుచుండ, నాసతీతిలక మావంతయుఁ గినుకఁబూనక, పోయిపోయి యొక మాదిగపల్లెకడ విహరించుచుండెను.

ఒకనాఁడు దండకారణ్యమునఁ దనసతితోడఁ దపమాచరించుచున్న యొకమునికడకు మలినవస్త్రుఁడయి యేతెంచిన యోగిశ్రేష్ఠున కాతనిభార్య బువ్వ నిడఁబోవ నతఁడా మలినాంగుఁడగు యోగికి భైక్ష్య మిడవల దని వారింప, నా యతితిలకుఁ డుగ్రుఁడై "మీరుచండాలురు గం"డనిశపియించె. అంత భయవిహ్వలులై వార లాతనిపాదరేణువులు సోక సాగిలి మ్రొక్కి, తమశాపవిమోచనమార్గముఁ జూపుఁడని వేడఁ, గరుణించి, మీర లొక్కపతివ్రతాతిలకముం గని యా యమసుగుణముల వర్ణించుచుండుతఱి మీనిజరూపములఁ బొందఁగల్గుటయేకాక యాపెకు పాపనివృత్తి యునగునని ఋషిసత్తము డనుగ్రహించె. అట్లే యా చండాలదంపతు లొకనాఁ డీ చంపకం గని పొగడుట దటస్థింప వారిచండాలత్వంబు బోయె. వారలవలనఁదనచరిత్ర నెఱిఁగి తనపాపముగూడ వీడుటచే మగిడి యీ నాకలోకమున కేతెంచి యాచంపక సుఖంబుండె. కనుక నో భూసురా! ఈవును బుద్ధిమంతుఁడవై తేని మర్త్యలోకమున కేఁగి సుకృత మార్జించి రమ్మని దేవేం

డు్రఁడు కరుణాపరిపూర్ణుఁడయి వచింప, నాద్విజుఁడు కళింగ దేశమున విష్టుభొట్లను నామమున బునర్జన్మము నొంది సకలసద్గుణగరిష్ఠుఁ డయి రూపలావణ్యవతి యగు కన్నం బరిణయమాడి పెక్కుజన్మముల నర్వీసురులఁ బూజించి సహధర్మచారిణి యగు గృహిణితోడఁ గాలముగడఁపి మఱల నిందరిలోకమున కేఁగి సుఖం బుండెను.

కం. కావున గృహికి నవశ్యము
సూవె యతిథిపూజ యట్టి సుకృతక్రియకుం
దావలము భార్య యది స
ద్భావసరణి మెలఁగకున్నఁ దప్పు సఖలమున్

ఓకలార్థి! దీనంగల నీతి ప్రతిగృహస్థునకును నతిథిపూజ ముఖ్యధర్మ మనియుఁ దదాచరణము కులసతిప్రాపుసంగాని సిద్ధింపనేర దనియు మన మెఱింగితిమి. దాననే యార్యులు "గృహిణీ గృహ ముచ్య తే" యని నుడివెదరు.

# II

# పతివ్రతామాహాత్మ్యము.



శ్రీమన్మధ్యమలోకపురీమతల్లి యగు రత్నపురము నందలి బ్రాహ్మణోత్తములు యజన యాజన అధ్యయన అధ్యాపన దాన ప్రతిగ్రహంబులఁ జేయుచు వేదపఠనమున వార్ధక్యమునఁ జపలుఁ డయియున్న బ్రహ్మనుగూడ ధిక్క రించు చుండిరి; క్షత్రియులు వీరధర్మము మెఱయ నెల్లపరి పంథిరాజచూడామణులఁ దమకరవాలముల కెరఁజేయుచుఁ గార్తవీర్యార్జున పరశురామాదులనేని నావలకుఁ ద్రోసిరా జనఁగల భుజాశక్తిగలిగి చక్కఁగ భూపాలన మొనర్చుచుం డిరి. వైశ్యు లితరదేశములందు నవరత్నముల బేరమాడుచుఁ గుబేరుఁ జిరికిఁగొనకుండిరి. శూద్రు లుగ్రమగు చట్టుల నయితము భుజబలమున బగులద్రొబ్బి తొమ్మిది పైరులఁ బండించుచుండిరి. ఆనగరమునంగల ప్రతిభూజమును గల్ప వృక్షముమాడ్కి సర్వవిధముల నుపయుక్తమై వెలయు చుండెను.

మఱియు సురరాజెక్కి తిరిగెడు నైరావతముకులప్ర మాతంగములతోడను, నరుణురథమునకుఁ గట్టిన వాజులసం తతిగుఱ్ఱములతోడను, వెన్నుం డధిష్ఠించు దివ్యరథజాతి యరదములతోడను, ద్రివిష్టపైకవల్లభుని బలమువంటి కాల్బలముతోడను, బవిత్రములయి నేత్రోత్సవము గలుగఁ

జేయు కామధేనువుంబోలిన గోసముదాయముతోడను, బృహస్పతివంటి పండితోత్తములతోడను, ననన్యసామాన్యంబయి వెలయు నారత్నపురమును ముఖ్యపట్టణముగఁ జేసికొని మాళవదేశమును నందనుఁడను ఱేఁడతివిక్రమము మెఱయఁ బరిపాలించుచుండు.

రాకుమారుఁడు రత్నమండనుఁడు సుగుణపుంజమై యెల్లవిద్దెలమేటియయి ధనుర్విద్యావిశారదుఁడయి యొప్పువాఁడొక్కనాఁడు తన మిత్రిరత్నమగు నిందుదత్తుం దీసికొని వేఁటాడ నరణ్యమున కేగి పెక్కు దుష్టమృగములఁ జంపి చెండాడి నలుదిశలు దిరుఁగుచు వివిధకుసుమపరిమళభారమును వహించిన కమ్మతెమ్మెరల ననుభవించుచుండెను. తరువులనుండి రాలిన పుష్పములఁ జూచుచు, మధురరసము లాని మత్తిల్లి మధుకరములుచేయు ఝుంకారములును మయూరనినాదములును శ్రోత్రరసాయనముగా వారిరువురు వినుచుండిరి. మధురతరమును లొనర్చుచున్న వివిధశకుంతసంతానము వారల నానందపరవశులఁ జేయుచుండెను. అక్కడ కొందఱు జటాధరులు, కొందఱు పర్ణాశనులు, కొంద ఱూర్ధ్వబాహులునై తప మొనర్చుచుండిరి.

ఆ వనము సుందరతరుబృందములతో నిండియుండి మునులకు వాసయోగ్యముగ నుండెను. నేలయంతయుఁ బచ్చికతోఁ గప్పఁబడి రత్నకంబళము పఱచిన ట్లొప్పుచుండెను. కోయిలలు మృదుమధురగానములు సేయుచుండెను. పువ్వులగుత్తులతో నిండియున్న పల్లు లల్లిబిల్లిగ నల్లుకొన్న

నికుంజపుంజములు నేత్రముల కానంద మొసఁగుచుండెను. ఎల్లవృక్షములు ఫలభారముచే శిరములు వంచి మార్గస్థుల క్షుద్బాధను వాపుచుండెను. నెత్తావి గుబులుకొనఁగా నారత్న మండనునిమీఁదఁ బూలురాలెను. చిత్రవిచిత్రవర్ణములు గల పక్షులఁ బరికించినపుడా వనమెల్ల నింద్రచాపము లతో నింపఁబడి యున్నట్లు రాజనందనునిదృష్టికి భ్రమకలుగు చుండెను. కొంతదూరమున కిచకిచలాడుచు శాఖామృగము లొకకొమ్మపయినుండి వేఱొకదానిమీఁదికి గంతులు వేయు చుండుట లోచనగోచరము లగుచుండెను. ఆపైన నిశ్శబ్దముగఁ బ్రవహించునేఱును దానిగట్టులనున్న పచ్చికమేయుచున్న సుందరవిశాలచంచలలోచనములుగలలేళ్లను నాలేళ్లనుబట్ట చెలికత్తెల పిండుతో విహరించుచున్న రత్నప్రభాభాసమాన మగు మేనికాంతులుగల యొక రాజకుమారిం గని భూమి కే తెంచిన సాక్షాల్లక్ష్మియో, యరణ్యమున విహరింపఁదలఁపు పుట్టి మానుషరూపమును దాల్చిన రతీదేవియో యని దానిరూప లావణ్యసంపదల కత్యాశ్చర్యపడుచు నయ్యది యవివాహితగా నిశ్చయించి దాని పాణిగ్రహణ మెట్లు లభించునా యని రత్న మండనుఁడు తలపోయుచు నిశ్చేష్టితుఁ డయ్యెను.

పుష్పగంధియుఁ గొలఁదిదూరమునఁ దళతళ మెఱయు చున్న రత్నమండనుం గని భూలోకమును బరీక్ష సేయ నవతరిం చిన శచీనాథుఁడో రతీదేవుఁడో యని డెందమున దలంచుచు వానిఁ బరిణయమాడక కాలముగడపని జన్మమేల యని యెం చుచు నావార్తను జెలులకుఁ జెప్పనెఱచుచు లోలోనఁ బం

తించుచు తెప్ప లల్లార్చుచు మనోజాతశరబాధితయై సోలి
భూమిపయి వ్రాలెను.

పుష్పగంధి చెలికత్తియలలో మేటియగు మాలిని యా
రాకుమార్తె పచ్చవిల్తునచ్చపువిరితూపులచే నొచ్చియుంటఁ
గాంచి, రా జావార్త విన్నఁ దన్నుఁ గరఁబు దండించు నని
మనఁబునఁ దలంచి, తక్కుంగల చెలులఁ బేరు పేరునఁ బిలిచి
'చెలులారా! మన ముదయమున నీవనమున కేతెంచి యింత
ప్రొద్దెక్కుదనుక గృహమున కేగకుండ నుండరాదు. మన
తేఁడు మనల మన్నింపఁడు. మఱియు నీకోమలాంగి యె
వ్వనిపయిననో మనఁబు నిల్పి యున్నట్లు గనపడుచున్నది.
కాకున్న నింతదనుక శృంగారముగ విహరించినదాని కీ మనో
తాపమేల కలిగె! ఇఁకేముం దిట మన ముండిన బెట్టుచెడి
రట్లు గలుగు. రండురండు వెడలుద' మని చెప్పుచుఁ బుష్ప
గంధిశరీరమునిండఁ బుష్పములను దీఁగెల నంచి నలువు రేసి
చొప్పున మోసికొనుచుఁ బురమును బ్రవేశింపఁబోవుచుండిరి.

ఇంద్రదత్తుఁడు సెలయేటిలో నీరు ద్రావి యటగల
చిత్రముల గాంచుచు మెల్లనవచ్చి తన మిత్రుఁడగు రత్నమం
డనుఁడు మూర్ఛవోయియుంటకుఁ గారణ మారయఁజాలక
పరిపరివిధముల వితర్కించుచుఁ జివర కతఁడు మదనకీలలఁ
గ్రాలుచున్నవానిగఁ దలపోసి 'మిత్రమా! రత్నమండనా!
ఉత్తమవంశసంజాతుఁడవయి చతుస్సముద్ర వేలావలయితం
బగు భూమండలమునకుఁ గర్తవై యొక్క కన్యకై యిట్లు డెం
దము నీరుగాఁ జేయఁదగునే? ఎంతమంది కన్నియలు లేరు?

నీవు కోరినచో స్వర్లోకముననున్న రంభాయూర్వశులఁ దేనా నాగలోకమునంగల ఫణిరాజుబిడ్డంగోరిన నొక్కనిమిషమునఁ దెచ్చిపెట్టనే? హీనునిపగిదిఁ గరంబు జింతఁగొనకు మ'మ్మని ధైర్యోక్తులు వలుకుచున్న యింద్రదత్తు నారాకుమారుఁడు కన్నెత్తిచూచి నెమ్మదిగ, 'మిత్రరత్నమా! నీవు జలపానార్థము వెళ్లినపు డొకయిందీవరాక్షిం గంటి. ఆపద్మాక్షిసొంపు వర్ణింపనేర. ఫణిరాజును దెలుపఁజాలఁడు. ఇంద్రదత్తా! నే నేమని చెప్పుదు దానిరూపమహిమ! దానిపాదములును హస్తములును లేమావిచిగుళ్లవలె మృదువులయి మనోహరముగ నున్నవి. ఆలేమశరీరసౌకుమార్యము పదియార్వన్నె పసిండిని ధిక్కరించుచున్నది. ఆపూఁబోఁడివదనము షోడశకళలతో నిండియున్న పున్నమచందురుఁ దిరస్కరించి వైచుచున్నది. ఆపడఁతినేత్రములు విశాలములయి పద్మపురేకులఁ దీసివైచుచుఁ దళతళఁ గ్రొమ్మెఱుంగుదీవెవలె మెఱయుచున్నవి. ఆపాటలగంధి వదనము దరహాసితమై యధరము కావిరంగున వెలయుచున్నది. అన్నా! దానియొయ్యారపు నడకలు దానినేత్రరుచులును దానిముద్దులమాటలు నే నేమని చెప్పఁగల' నని కన్నీరొలికించుచు నేల కొరిగెను.

ఇంద్రదత్తుఁడు రత్నమండనుని లేవదీసి కూర్చుండఁ బెట్టి వానివలన నాకన్నియ లేగినజాడలు నెఱింగి త్వరితముగ నాపుష్పగంధిని నెచ్చెలిపిండు తోడ్కొని వెడలిన ప్రదేశమునకుఁబోయి యొక విశాలవృక్షమునీడఁ బరుండఁబెట్టి యుత్తరీ

యములతో సేదదీఱునట్లు విసరుచున్న వారిం గని సంతోషా యత్తచిత్తుఁడయి యిట్లని సంభాషించు:—

'కొమ్మలారా! మీరేల యిట వసించి యున్నారలు?'

'రాకుమారా! మాతేనికూఁతురు పుష్పగంధి డస్సి యుండ నాయమ కుపచారములు సేయుచున్నారము.'

'పద్మమిత్రుఁ డుగ్రుఁడుగ లేఁడే! ఇంత పొద్దుకే తడ బడినదా?'

'రాజపుత్రా! నేఁటియుదయము మారాజనందిని పుష్ప గంధియు మేమును గృహము వీడి పరిసరారామభూములఁ గ్రుమ్మరుచుంటిమి. అట్టితఱి నెవ్వరో నవమన్మథాకారుం డీపె నేత్రములకుఁ బొడకనట్టెనఁట. వానిరూపమున కీమె చిక్కువడి తపించుట మేముగాంచి కన్యాత్వమునకు భంగము వాటిల్లునని తలచి......'

'తర్వాత నేమి జరిఁగినది?'

'తీసికొనివచ్చి యిటఁ బరుండఁబెట్టి, యెన్నెన్నియో రీతుల మనస్సు మార్పవలయు నని ప్రయత్నములు సేయు చున్నాము, కాని......'

'సంపూర్ణముగఁ జెప్పకున్న మాకెట్లు తెలియు? ముద్ద ముద్దకుఁ గొత్తరుచులా?'

'మారాజనందిని వానిం దనడెందమున నిలిపి వాని కయి పరితపించుచున్నది.'

అప్పు డిందిరదత్తుఁ డీకఁ దానాలసింపఁదగదని యెంచి,

'చెలులారా! వినుఁడు. మీపుష్పగంధి యేయువకుని కొఱకు పరితపించుచున్నదో యారత్నమండనుఁ డక్కడ మీ పద్మాక్షికయి పెక్కుతెఱఁగుల విరహబాధ నొందుచున్నాఁడు. నేనాతని ప్రియమిత్రుఁడ. న న్నిందిరదత్తుందురు.'

'అన్నా! రత్నమండనుఁడా యాతఁడు? నిజముగా మాకన్నియను వరించెఁగా? నీపలుకులు నిక్కములేకదా! మాదుఃఖమును వారింపఁగాదుగా నీవిట్టు లనుట?'

'అంగనలారా! మీతో సబద్ధములాడునంతపని నాకేల? నా మిత్రుఁడీ యోషామణికై పోయిరమ్మనుటచే నే నిటు లేతెంచితి.'

'బాబూ! ఆతఁ డేకొలమువాఁడు?'

'రాకొమరుఁడు.'

'బాబూ! ఆ రాకుమారుఁ డేదేశముఁ బాలించెడి రాజు కొడుకో!'

'లేమలారా! ఆతఁ డత్యధికవిభవాభిరామంబగు రత్నపురమును ముఖ్యపట్టనముగఁ జేసికొని మాళవదేవమును బాలింపుచుండు మేటిపరాక్రముఁడగు 'నందను' నకును సుగుణవతియగు 'సంబిక'కును బట్టిన రాజచూడామణియగు రత్నమండనుఁడు.'

'అట్టులనా!'

'అమ్మా! యీపె రాజనందిని యంటివే ! ఏరాజు కుమారితె సవిస్తారము తెలియంగవచ్చునా?'

'రాజమిత్రా! ఎఱుఁగరాకేమి. ఆవృత్తాంత మాలింపుము. అవక్రమగు విక్రమమున మేవాడరాజ్యమును బాలించు 'సంపాతి' నృపాలునకును 'జంద్రరేఖ'కును సుద్భవించిన సుగుణపుంజ మీపుష్పగంధి'

'మంచిది. అనుకూలమగు దాంపత్యమేకదా ?'

అని యింద్రదత్తుఁడు పుష్పగంధి పరిక్రమమును జక్కఁగ నెఱిఁగి, తనమిత్రునికోర్కెఁ దీర్చవచ్చు ననెడి కొండంత యాశతో, నెప్పుడింద్రదత్తుఁ డేతెంచునా? ఎప్పుడాకన్నియను జేపట్టుదునా? యని యువ్విళ్ళూరుచున్న రత్నమండనునిఁ ద్వరితగతిఁ జని కలిసికొని మృదుమధురశైలితోఁ దాఁ బుష్పగంధి నెచ్చెలిపిండుతో ముచ్చటించుటను గూర్చియు నాయమగాఢానురాగమును గూర్చియుఁ దా వారలతోఁ జెప్పిన దానిని, నామూలాగ్రముగ వచించి యిట్లనియె.

ఆ॥ "మరలఁ బనిచి, రేను నరుఁగుదెంచితి, నింకఁ
గంతుఁ దక్క యాలతాంతగంధి
నఖిలబంధుచయము ననుమతింపఁగఁ బెండ్లి
యగుదుగాక వేడ్క లగ్గలింప."

పుష్పగంధి నిజగృహమునకు వెడలినది మొదలు సతత మారత్నమండనుని స్వరూపమును స్మరించుచుఁ జెలులతో నాటలనాడదు. పాటలఁబాడదు. వేళకుఁ గుడువదు.

పానీయములు గొనదు. పంజరములలోని రామచిలుకల
రొద సేయుచున్నను కన్నెత్తి చూడదు. కోయిలల గానము
నకుఁ గర్ణము లొగ్గదు. మధురములగు ఫలములఁ దరికిఁ
రానీదు. తల్లిదండ్రులకుఁ దన డెందము విప్పి చెప్పదు.
చక్కని నిద్రలేదు. నెఱులు ముడుచుట నెఱుగదు. సొమ్ముల
సింగారింపదు. ఇట్లున్న చంచలాక్షి యవస్థ లొక్కనాఁడు
మాలిని రాజునకుఁ దెలుప నా రాజశ్రేష్ఠుఁడు పుష్పగంధిని
రాఁ బిలిచి నిజాంకమునఁ గూర్చుండఁబెట్టుకొని 'తనయా!
షోడశకళాపరిపూర్ణుఁ డగు చంద్రునికైన వంకగలదుగాని
నీ యాననమునఁ గానమే? అట్టి పద్మాననకు నీ కిట్టి చింత
యేల? సమస్తభాగ్యభోగ్యములఁ దులఁదూఁగు మహా
రాజునకుఁ గూరిమిఁ గూర్చు కొమరితకీ మనోవేదనయేడ?
'బిడ్డా! నేను సంతానములేక పరమేశ్వరింగూర్చి పెక్కేడులు
ఘోరతప మొనరింప నంబిక నాకుఁ బ్రత్యక్షమై నిన్నుఁ
బ్రసాదించె. నీ జన్మనక్షత్రమును కులగురువులుసూడ నీవు
పరిణయమాడిన నెలలోపల నీదుభర్త మడియు నని వచించిరి.
ఆకారణమున నీకేను బరిణయము సేయఁదలఁపక కాలముఁబు
చ్చుచుంటి'నని చెప్పిన జనకునిపలుకు లా కన్నియకుఁ జెవులకు
ములుకులుగఁ దోఁపఁ గొంతతడ వూరకుండి వినయముమీఱ
సంపాతినృపాలునితోఁ గుమరితె యి ట్లనెను. 'జనకా!
ప్రపంచమునఁబుట్టి యుత్తమపురుషుఁ జేపట్టిగదా సంసార
మనెడుదానిఁ బొందుట. సతికిఁ బతిలేని బ్రదుకేల? నన్నుఁ
బరిణయమాడఁగనే యా పురుషుఁడు చచ్చినను నేనాపురుష

సింహమును విడువఁజాల మనోవాక్కాయకర్మములచేత నే నా యువకుఁ గోరితి; నింక నా మనసు మాఱదు. త్రికరణములలో మనస్సు దొడ్డది. అట్టి మనస్సునఁ గోరఁబడ్డవాని విడువనొల్ల. శీఘ్రగతి న న్నా రత్నమండనున కిచ్చి పరిణయ మొనర్పుము. కాదేని యసువులఁ బాసెద' నని గట్టిగఁ జెప్పెను.

అంత నారాజునకు కొమరితెమాట కెదురాడుటకుఁ దోఁచినది కాదు. లేక లేక కలిగిన కుమారికి ముం దెన్నఁడో ముప్పురాఁగల దని ముద్దుగులుకుసౌందర్యముఁ గోల్పొమ్మని చెప్ప నేవాఁడు సాహసించు? ఆభూకాంతుఁడు తనడెందమున 'దైవమా! ఎన్నెన్నియో వ్రతము లాచరింపఁ బ్రత్యక్షమై సంతానము నిచ్చితివి. నే నేమి దోసమొనర్చితి నని నా క కన్నియ నిచ్చితివి. పోనీ దానికిని సంతోషించి కాలము గడఁపకుండ నల్లున కర్థాయుష్య మేల? దురదృష్టునిగాఁ జేయనెంచికాదె నీ వి ట్లొనర్చుట? నాయొనర్చిన యకార్యము లెయ్యవి? అతిథుల గారవింపనా? అహింసఁ దలంపనా?' ముష్కరుల దండింపనా? పండితులఁ బోషింపనా? ప్రజల బిడ్డలవలెఁ జూడనా? అనపరాధులఁ గోపించితినా? మఱియిఁక నెందు నాతప్పు? సేవకులనయితము ప్రాణబంధువులవలెఁ బరిగణింతు నే! నా కీగతియేల? అన్నా! ఈకన్నియ సుకుమారాకారముంగన్న గుండెకుఁ గూఁడువట్టదు. కంటికి నిదురపట్టదు. పోనీ మూర్ఖత్వమున నొక్క రాజపుత్రిన కొనంగి పరిణయమొనర్తునందునా గురుఁ డింతకుమున్నె భావి వ్యదర్థము నెఱిఁగించె. చేతులార నీపద్మాక్షికి వివాహము

నేసి వైధవ్యమును గొని తెచ్చుటకు మనసొప్పదు. కన్నియగ
నుంచుటకా నాబిడ్డ సమ్మతింపదు. దైవమా! ఇఁక నే నొ
నర్పఁ దగినది తెలియరాకున్నదికదా!' యని తలపోయు
చుండెను.

అట రత్నమండనుఁ డశనమును మాని యెల్లప్రొద్దులు
'పుష్పగంధీ! పుష్పగంధీ!!' యని తలంచుచుండు. రాజ్య
పరిపాలనఁ జూడఁడు. తండ్రికి తనసందేహము విన్నవింపఁడు.
ఇంద్రదత్తు ననవరతము తనమ్రోల నిలిపికొని పెక్కుతెఱఁ
గుల నారమణీమణిసౌందర్యాతిశయములఁ జెప్పించుకొనుచుఁ
గలలోఁ గా నా పద్మగంధిని గలిసికొన్నట్లును నాయమతో
సరససల్లాపము లాడుచున్నట్లును దలంచుచుండు. మాటి
మాటికి 'మిత్రమా! ఇంద్రదత్తా! అలనాఁ డా వనమునఁ గాన
వచ్చినపద్మగంధిని దెచ్చి పరిణయ మొనర్చెద నంటివే
య దెన్నఁడోగదా! ఇఁక నే నీమదనజ్వాలల భరింపఁజాల'
ననుచుండు.

ఇంద్రదత్తుఁడు రత్నమండనుని విరహవేదనను జూడఁ
జాలక నందనమహారాజున కావార్త నేకాంతముగఁ జెప్ప
నాభూవల్లభుఁడు నిజనందనుం బిలిచి, 'కుమారా! రత్నమం
డనా! సమస్తమహీచక్రము నేకచ్ఛత్రాధిపత్యమునఁ
బాలన మొనర్చు నాకుఁ బుత్రుఁడ వగు నీ కిట్టిచింత తగునే?
బిడ్డా! నీవుకోరినదాని స్వర్లోకమునుండియైన దెమ్మన్న నుత్తర
క్షణంబున దెచ్చియియ్యనా? అట్టియెడ నీకు భూలోకమున
మన కడ్డే? ఇట్టి దిగులు బూననేల? ఇదె చూడుము. చతురంగ

బలసమేతముగ మేవాడదేశాధీశుఁ బరిమార్చి వానికూతుం దెచ్చి నీకుఁ బరిణయము సేసెద' నని ధైర్యమున ధీరోక్తులు వలుకుచు బలముల నాయత్తపఱపించుచుండ కులగురువును జ్యోతిశ్శాస్త్రపారంగతుఁడును సకలసద్గుణఖనియు నగు చంద్రశర్మ యను బ్రాహ్మణోత్తముఁడు నందనునితో, 'రాజకులతిలకా! మేవాడాధీశునిపయి సర్వబలములతోడ విడియుట కతఁడు తమకోర్కి కడ్డుసెప్పె ననియా? మున్ముందుగ దాడి వెడలఁ బాడియగునే? సామదానభేదదండోపాయము లని చెప్ప వినమా? మనపిల్లవానిరూపము నొకపటమునఁ జిత్రింపించి మేవాడదేశాధిపతికడ కంపుఁడు. ఆతఁడును దనకన్నియ స్వరూపముగలదాని మనకంపు'నని పచింప నారాజు నట్లచేసెను.

కన్నియచే వరింపఁబడినరత్నమండనుఁడు దేరూపువాఁడా యని తలపోయుచున్న సంపాతినృపాలుకడకు నందనమహారాజుచే నంపఁబడిన బ్రాహ్మణోత్తము లాధరావల్లభునిచేఁ జక్కఁగ బహూకరింపఁబడి, యాతనితో నందనుఁడు సెప్పమన్న యర్థమునంతయుఁ జెప్పి, రత్నమండనుని చిత్రఫలకము నీయ, నామేవాడదేశాధీశుఁడు వానిరూపసౌందర్యముల కమితసంతోషము నొందుచు గురువులచేత లగ్నము వెట్టింప మనసురాక తనకూతు చిత్రఫలకము నాభూసురుల కిచ్చి తొల్లి తనకన్నియపుట్టినపుడుగల దుష్టగ్రహసంపుటింగూర్చి వచించెను.

పుష్పగంధిచిత్రఫలకమును దెచ్చి భూసురోత్తములు నందనమహారాజున కిచ్చి పుష్పగంధిం బరిణయమాడెదు పురు

షుఁడు నెలరోజులలోపల మడియుటంగూర్చి వక్కాణించిరి. అంత నందనుఁ డాచిత్తరువును నేలకుఁ గొట్టి 'రత్నమండనా! ఇంకెక్కడి వివాహము! వింటివిగదా పుష్పగంధిచరిత్రము బ్రాహ్మణులు సెప్ప. అన్నా! ఇఁక నీవూవుఁబోఁడిపయింగల మోహలతలు గోసివైవుము. ప్రపంచమున నెందఱు కన్నియ లులేరు? దీనిందప్ప మఱిదేనినైనఁ దెచ్చి పరిణయమొనర్చెద. భగవదనుగ్రహమునలన గలిగిన సకలసద్గుణముల మేటివగు నిన్నీరాకాసికిఁ గట్టిపెట్ట నేల? దానిచరిత్ర విన్నంతనే నా గుండియ లవియుచున్నవి. ఉత్తమవంశజాతుఁడ వగు నిన్నీ యువతి పొట్టన బెట్టకుండఁ బాప మా సంపాతి యథార్థవాది గనుక తెలియపఱచినాఁడు. వత్సా! నా కులదీపకా!! ఆ కన్నియనుగోరకు'మని హితవుగఱప, రాకుమారుఁడు జనకునితో 'జనకా! ఏది చెప్పినను విందుఁగాని దాని వీడుటకు నా మన సొప్పకున్నది. ఎట్టి వింతగ నున్నది బ్రాహ్మణులరాయ బారము! పరిణయమాడిన మాసములోపల వరుఁడు మడియు ననియా? అయిన మడియని దెవరు? "జాతస్య మరణం ధ్రువ" మ్మని యెఱుఁగరు కాఁబోలు! పురుషుఁడుగాని స్త్రీగాని బ్రతికిన కొలఁదికాలములో నన్యోన్యప్రేమానురాగము లుండ వలదా? త్రికరణశుద్ధిగ నే నా కన్యను వరించితి. నా ప్రాణములనైనఁ గోల్పోయెదగాని దాని వీడనొల్ల' నని మన్మథో ద్రేకమున గట్టిగఁ బలుక పాప మా నందనమహారా జేమియు వచింపనేరక కన్నీ రొలికించుచుండఁ జంద్రశర్మ రత్నమండ నుఁడువిప్రారాధనతత్పరుఁ డని చక్కఁగ నెఱిఁగినవాఁడు గాన

నందనభూపాలుసన్నిధి కేగి, 'రాజకులభూషణా ! ఇది
నీకుఁ దగునే? గట్టిగఁ బరిణయమాడి నెంచిననీకొమరు
వారించుట తగదు. అతఁడు విప్రుల నెంతో గౌరవించు
చుండు. వారల యాశీర్వాదఫలితముచే నతఁడు మృత్యుశా
పము దన్ని చక్కనికాఁపురము సేయఁగలఁడు. విప్రాశీర్వచ
నమును నెంచి తెంగలు మహామృత్యువాతనుండి బయలు
వడరు? తొల్లి నేపాళదేశమును బాలించు భద్రకుఁ డను
ఱేఁ డొక్కనాఁడు పరిసరారణ్యమునకు వేఁటాడువేడుకం జని
దుష్టమృగముల ఖండించి యొక్కమఱ్ఱిక్రిందికి విశ్రమింపంజన
దానిశాఖపయినున్న కాలజ్ఞుఁడనుపక్షి దానిసతితో 'వింటివా!
నేఁ డీయరణ్యమునఁ బూరిఁ గోయుట కేతెంచెడు కాఁపువాఁ
డొక్కఁడు సర్పదష్టుఁడగుఁగదా' యనెను. భద్రకుఁ డా
పులుగులవాక్యసరణిని గనిపెట్టి నెంచి కాఁపుకై నిరీక్షించు
చుండ నొక్కపొడ వగు మానిసి శిరమున గడ్డిమోపును ధరించి
చేతదుడ్డుకఱ్ఱను బూని గృహోన్ముఖుఁడై చనుచుండెను.
అధరాధిపుఁ డా కాలజ్ఞువైపుఁ జూపు నిలిపి. 'ఓయీ! శకున
పక్షీ! నీ వింతకుముం దేమేమో నీపడతికిఁ దెలుపుచుంటి,
వది యేమయ్యె? కాఁపువాఁ డల్లదె మోపును ధరించి వచ్చు
చున్నాఁ, డతనికిఁ గాలునిదూతలు వెఱచిరా? చంపవచ్చిన
మృత్యువును ధిక్కరించెనా? కాఁపులఁ జంపరా దని సర్పము
వరువ త్తైనా? లేక నీ వుల్లసమున కట్లు నీసతితో నంటివా?'
యని హేళనఁజేయ నాశకునపక్షి రైతువానిఁ దనకడకుఁ
బిలిచి వానిచేతనున్న కక్కులకొడవలికి దంగశూకపుతల

యంటియుంట రాజునకుఁ జూపి, 'యోకాఁపా! నీ వడవి కేఁగి నపు డేమి జరిఁగిన దో తెలుపు'మనవుడు వాఁడు 'పక్షిరాజమా! ఎద్దులఁ బొఁషుచుకొని వ్యవసాయముసేయు మాబోంట్ల కేమి తెలియు? నేఁ గొండచెంతఁ గసవుఁగోయ వెళ్ళుచుండ నెవ్వ రో యొక్క బ్రాహ్మణుఁడు నా కగపడ నే నాతనికి నమస్క రింప న న్నతఁ డేమియో దీవించె; నింతకన్న నొండు నే నెఱుఁ గ'నని యాకాఁపువాఁ డన నాకాలజ్ఞుఁడు భద్రకునకు సర్వముఁ దెలిపి విప్రాశీర్వచన ప్రభావమును బెక్కు తెఱఁగుల బోధిం చెను. కనుక నీపుత్రుఁడును విప్రాశీర్వచనమున దీర్ఘాయు ష్మంతుఁ డవునసట కెట్టి సందియములేదు. మార్కండే యుఁడు చిరంజీవి యగుట బ్రాహ్మణాశీర్వాదఫలితమెగదా!

ఆ॥వె॥ అల మృకండుసుతున కల్పాయువని మున్న
వ్రాసె బ్రహ్మ; యతని వ్రాఁతలెల్లఁ
దెంపుచేసి విప్రదీవన నతఁ డిట్టి
బ్రదుకుబ్రదికె; వినవె పార్థివేంద్ర!

అని చెప్ప మాళవాధీశ్వరుఁడు వేఱుపాయము గానక మనస్సును గుదురుపఱచుకొని తనకుమారునకుఁ బుష్ప గంధిని బెండ్లిసేయ నెంచి శుభలేఖల వ్రాయించి సంపాతి మహారాజున కంపెను.

మేవాడదేశాధీశ్వరుఁడు నందనునిచేఁ బంపఁబడిన శుభ లేఖం గని భవితవ్యమునకు వందురుచుఁ గన్నీరుఁగార్ప కుల గురుఁ డతని బాష్పధారఁ గని 'రాజా! ఇది సంతోషింపఁదగిన సమయముగాని దుఃఖింపఁదగినది కాదు. సమస్తము నెఱిఁ

గిన తమ బోం ట్రెట్లు ఖిన్నులు గాఁ దగునే ? విధి కృతము నెవఁడు తప్పింపఁగలఁడు? పరిణయమాడిన పం డ్రెండు నెలలలోపల సత్యవంతుఁడు మడియు నని దేవముని సెప్పినను కుమార్తె మనోరథంబుఁ దీర్ప నెంచి యశ్వపతి మహారాజు సావిత్రి నిచ్చి పెండ్లిసేసి యశఃకాముఁడు కాఁడె ? మనము తలఁచినదే జరుగునా ? తా నొకటి తలఁచిన దైవ మొండు తలఁచు; నిందుల కొక తార్కాణము నాలింపుఁడు. సౌవీరదేశమును బాలించు సునందనుఁ డను రాజున కనన్య సామాన్యగుణవతి యగు సుశీల యను కన్యారత్నముగల; దద్దానిం దన చెలియలికొడుకున కిచ్చి పెండ్లిసేయవలయు నని యాతఁడును, తనయన్నపుత్త్రిన కియ్య నాతని భార్యయు నెంచి యిరువురును దమతమబంధువుల రావించిరి. బ్రహ్మ విష్ణు మాహేశ్వరు లాకసమున విమానారూఢులై పోవుచు, హైమవతీపతి భారతీపతిం జూచి 'హిరణ్యగర్భా ! సునంద నందనకు భర్త నేవానిగ నొసర్చితి, వని యడుఁగ నతఁ డా కన్నియ కొక పిచ్చుగుంటువాఁడు పతి కాఁగలఁ డనియు నద్దానిం బరీక్షింప నెంచితిరేని గరుత్మంతుఁడు తన పక్షములపయి నా పిచ్చుగుంటునుం గొంపోయి వార్ధి కావలనున్న కాననమున నుంచున ట్లనుజ్ఞ నిమ్మని లక్ష్మీపతిం బ్రార్థింప నతఁ డట్లొనర్ప నా పిచ్చుగుంటు నలుదిశలు బరికించి తా నశనమునకయి యనవరతము దిరుఁగుగృహములఁ గాంచఁ జాలక విభ్రాంతుఁ డగుచు "నాఋబోసినవాఁడు నీరుఁ బోయ కుండునా!" యని తలంచి శ్రీమన్మహావిష్ణుంగూర్చి ప్రార్థింప,

నాతఁ డతనిబత్తికి హెచ్చుగ మెచ్చి వైనతేయు నంప నతఁ
డా పురంబునంగల ఘృతపాయసాపూపాది వివిధపదార్థము
లుంగల బువ్వకావడి నొక్కదానిం దెచ్చిపెట్టి వెళ్ళెను. వాఁ
డా పదార్థములఁ దిన నెంచుచుండఁ బసిఁడిమేనుగల యిందీ
వరాక్షి యొక్క తె చెలువడీ మురిపెమునఁ దలఁబ్రాలఁబ్రోసి
మధురపదార్థముల నియ్య భక్షింపుచు వరుఁ డాయమచరి
త్రమును విని బ్రహ్మదేవుని సృష్టికత్యాశ్చర్య మందుచుండెను.
అట సునందనుఁడును నతని భార్యయుఁ దమసుతను గాంచఁ
జాలక దుఃఖించుచుండ వచ్చిన బంధువులెల్లఱు దమతమ
పురముల కేఁగిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మువ్వురును
భూసురరూపముల ధరించి కాననమునన్ను యా దంపతుల
కడ కేఁగి వారల పరస్పరానురాగములకుఁ గరంబు మెచ్చి
తమతమరూపములు సూపి విష్ణుం డున్నతపదంబు నొసఁ
గె. బ్రహ్మదేవర యైదువతనంబు చాల యనుగ్రహించె.
పార్వతీశుఁ డధికజ్ఞానము బ్రసాదించె. లక్ష్మీశుఁడు
వారల నిద్దఱ గరుత్మంతుచే సౌవీరనగరమునకుఁ బనుప
నాసుశీలయుఁ దన తల్లిదండ్రులకుఁ దాఁబోయి వచ్చిన
తెఱఁగుం జెప్పి నాథుంజూప సునందనుఁ డపరిమితానందమున
రాజ్యమునంతయు నాపిచ్చుగుంటున కిచ్చి సుఖం బుండె.
కనుక దైవవిధి యనివార్యము. సందియ ముడిఁగి తమతనయ
కుఁ బరిణయ మొనర్పఁ డాయమ తనసద్గుణములచే నాథుఁబున
ర్జీవితు నొనర్చుకొనునేమో? తొల్లి సావిత్రి యముని బారి
నుండి ప్రాణనాథుయసువులఁ దెచ్చి పుట్టినయింటిని మెట్టిన

యింటిని బవిత్రిత మొనర్పదే!' యని చెప్ప నాసంపాతి తన కూఁతు రత్నమండనున కియ్యఁ గుతూహలియై యంగీకార మును దెలిపెడు శుభలేఖల నందనమహారాజున కంపెను.

నందనుఁడు సమస్తమంత్రిసామంతభూసురపౌరజానపదసహితుఁడయి సకలవాద్యములు మాఱుమ్రోఁత లీను చుండ మేవాడదేశమున కేఁగి యొక్కశుభముహూర్తమునఁ దనకుమారునకుఁ బుష్పగంధిం బెండ్లి సేసెను. రత్నమండనుఁడు మణికలితకనకాసనాసీనుఁడయి యెల్లవిప్రుల దాంబూలాది వివిధసత్కారంబులఁ దృప్తిపఱచి యాశీర్వాదములఁ బడసి బంధువులిచ్చు జాంబూనదాంబరాభరణాదుల స్వీకరించి చక్కని భోజనము సేసి ప్రొద్దువుచ్చి యారాత్రియందా లలనామణియుఁ దానును బరస్పరానురాగమునఁ జిత్తజకేళిం దేలిరి.

రత్నమండనుఁడు లబ్ధమనోరథుండయి సంపాతినృపాలు వలన సత్కృతుండై యపారవిభవంబున తన ముద్దులగుమ్మ యగు పుష్పగంధిం దీసికొని తన పట్టనమున కేతెంచి నందన మహారాజునకును నంబికకును బ్రణమిల్లి యథాసుఖవిహార ములఁ బ్రొద్దులు వుచ్చుచు నగ్నిసన్నిధిఁ బాణిగ్రహణవిధి లబ్ధయైన పుష్పగంధి నింటికడనుంచి తా నొకనాఁ డరణ్యము న కేగ వికృతాకారుం డగు బ్రహ్మరాక్షసుఁ డొకరుండు విశాలవృక్షమునఁ గూర్చుండి యెలుఁగెత్తి 'యోరాజనందనా! నీ విఁక నెట కేఁగెదు? నేఁడు నీదు మేనిం జించి యాహారముగఁ జేసికొనియెద నిదె యిటు ర' మ్మని పలుక నాసుందరాకారుఁ

డ తాత్పర్యమున నాపిళితాశనుఁ జూచి డెంపమున నిసుమం తయు దీనత్వము నూనక తనకలనాఁడు పుష్పగంధినిఁ బరిణ యమాడ నెంచెడుతఱి గురువులు సెప్పినదాని స్మరించి బమ్మరక్కసువాతఁబడక తప్ప దని మనమునఁ దలఁచి 'రాక్ష సోత్తమా! నీవు చెప్పినట్లు చేసెదఁగాని నామొఱ నొక టా లింప నెంతయుఁ బ్రార్థించెద. నే నీయుదయమున నెవరికిఁ జెప్ప కుండ నీకాననమున కేతెంచితి. నే నింటికి వెడలని-చో ననుఁ జూడక యొకనిముసమైనఁ గాలముగడఁపఁజాలని నాతలిదండ్రు లెంతగుందుదురో కదా! నే భూమిమీఁదఁ బడ్డదాది చన్ని చ్చిపెంచి పెద్దవానిగఁ జేసినదాది నను విడిచి బ్రదుకునా? ఒ కకంచమున గుడిచి యొకమంచమునఁ బవ్వళించు మన్మిత్రుఁ డింద్రదత్తు నాకొఱకయి యెంత పరితపించుచుండునో! మనో వాక్కాయములచేఁ గోరఁబడి యగ్నిసాక్షిగఁ బెండ్లియాడఁ బడిన పద్మపత్రాయతేక్షణ పుష్పగంధి నను విడచియుంట కెంతవగచునో? దానవేశ్వరా! నాయందుఁ గనికరించి సెల వొసంగిన నొక్కసారి యింటి కేఁగి వారలనెల్లఁ గడసారి చూపు చూచి నీకడ కేతెంచి నీ కాహారమయ్యెద' నని రత్న మండనుఁడు నుడువ నారాత్రించరుఁ డుగ్రుఁడై 'రాజా! ప్రపం చమునఁ బుట్టి నేర్చితివా పుట్టక నేర్చితివా యిట్టిముచ్చట్లు? ఎన్నఁడైన వింటిమా కంటిమా, మృత్యువాతఁ బడనున్న వాఁ డింటికేఁగి మఱలవచ్చుటలు! చాలు చాలు నీముచ్చట్లు. త్వరితముగ నీభూరుహముకడకు రమ్మని నిర్దయస్వాంతుఁడై పలుక నాధరాధిపనందనుఁడు మృదుమధురవాక్కులతో

'జనజోత్తమా! ప్రతిజీవియుఁ బుట్టి చావకపోఁడు. ఎల్లప్రాణు
లందు మనుజు నగ్రగణ్యునిగఁ బరమేశ్వరుఁ డొనర్చినాఁడు.
ఏజీవి యెల్లజంతువుల నగ్రగణ్యుఁడో యట్టివాఁడు యుక్తా
యుక్తవిచక్షణ నెఱుఁగక యబద్ధములాడిన ఘోరనరకము
నకుఁ బోవుననుట కెట్టి సందియమును లేదు. ధర్మమువలన నెట్టి
యత్యున్నతపదవికైనఁ బోఁగలఁడు. దానికి సాక్షియైన దిలఁ
గానము. కనుకఁ గృపవహించి నన్నంపుము. ఉత్తమక్షత్రియ
కులజుఁడవై యిట్టి యబద్ధమాడి పాపమొడిఁగట్టుకొందువే? తొ
ల్లి తిర్యగ్జాతిజంతు వగు ధేనువు నిజము వలికిగాదె విఖ్యాపనంబు
నొందె. దాని నాకర్ణింపుము. సకలశాస్త్రపారంగతుఁ డగు
సుశర్మ యను బ్రాహ్మణునకు నిత్యసత్యవర్తినియు సదాచార
మూర్తియు క్షీరసమృద్ధిఁ గలిగినదియు నగు పవిత్రమైన
గోవొక్కటి కలదు. అయ్యది యొక్కనాఁడు కసవుమేయఁ
గాననమున కేఁగ నొక్కపుండరీకము గోం బ్రెగుచు మీఁది
కుఱుకఁ బోవ నా సురభి 'యో మువ్వన్నెమెకమా! నిలు
నిలు!' మని గంభీరముగఁ బలుక నాతఁడు చిత్తరువుపోలె
నిలువ నగ్గోవు, 'పులులఱేడా! నే నొకధర్మువుఁ జెప్పెద నాలింపు.
ఆకలిబాధచే ననుఁ జంప నీ వెళ్లెంచుచుంటివో యట్లు కను
తెఱవని పసిదూఁడయు నంబా! యంబా! యని నా
కొఱకు విలపించుచుండు. వేకువజామున నే దాని నింటకడ
డించి పచ్చికమేసి మెచ్చుగ దానిం బోషింప నెంచితి. వ్యాఘ్ర
రాజమా! తల్లిలేని బిడ్డఁ డిడుమలు గుడుచుఁగదా! బూరుగు
దూదికంటెను ధూళికంటెను దల్లిలేనివాఁడు తేలికయందురే.

సమస్తము నెఱిఁగిన నీ కీ న్యాయము తెలియదా ? నీకుఁ జెప్ప నే నెంతదాన? బ్రాహ్మణులును పతివ్రతలును సద్భక్తులును గోవులును నవధ్యు లందురే ? నీ కాఁకలిగనుండిన మఱియితరములఁ గానవా? నన్నే భక్షించి యాఁకలి వాపుకొనఁదలఁచితేని నన్నొకసారి లేఁగదూఁడకడ కేఁగి పాలిచ్చి రానిమ్ము. మగిడి త్వరితముగఁ జేరి నీకోర్కెఁ దీర్తు. భూమ్యాకాశములును సూర్యచంద్రులును రాత్రింబవళ్ళును నే రాకున్నచోఁ దమ తమ నియమితకార్యములఁ దప్పుఁగాఁత ! ఇదె పోయి వచ్చెద' నని వచించి సెలవుగొని వెడలి, కన్నీరు గార్చుచు గడుపార నాదూఁడకు పాలిచ్చి 'బిడ్డా! నేఁటితో నీకును నాకును బాంధవ్యము తీఱినది. త్వరితముగఁ బోవలెను. పులి యెంత కోపించునో' యన నాపాపఁడు బిట్టువగచి 'యో చతుర్ముఖా! నే నేమి దోస మొనర్చితి' నని దుఃఖము చేసెదు. నీ కన్యాయ మింత తగునే?

క॥ ఆర్యులకు విహీనతయు న
నార్యులకు న్నతియుఁ జేసి యవినీతుఁడవై
కార్యము తప్పితి నీకు న
నార్యులు చుట్టములె యార్యు లరులె విధాతా!'

యని కోపావేశమున బలుకుచున్న శిశువు నూరార్చి యాగోవు 'వత్సా ! బుద్ధిమంతుఁడవై మనుమ' ని బోధించి పుండరీకముకడ కేగి 'పులీ! నన్నిదె భక్షించి నీ యాఁకలి దీర్చుకొ'మ్మని దగ్గఱకుఁబోవ నాపెద్దపులి రెండడుగులు వెనుకకుఁ బోవుచు 'నోగోవా ! నే పుట్టి పెక్కుజంతువుల జూచితిఁగాని

నీయట్టి నీతిగలదాని నెఱుఁగ. నీసత్యవాక్యమునకేను హెచ్చుగ మెచ్చితి. ఈతప్పు సైరించి నీబిడ్డకడ కేగి దానిఁ బోషింపు కొమ్మని చెప్ప నా సురభి 'పులిని భక్షింపు భక్షింపు' మని ప్రార్థించుచు ముందంజ వేయుటయుఁ బుండరీకము వలదు వలదని వెనుకంజ వేయుటయుఁ బద్మనాభుఁడు సూచి వెఱగంది నిజరూపము సూపి యా రెంటికిఁ గైవల్యముఁ బ్రసాదించె. రాత్రించరా! నేనును ద్వరితగతి నిదె వచ్చెద లేనిచో నెంతయో పాపమనుభవింతు సుమీ!" యని కొన్ని శపథములు సేసి సెలవుగొని తన గృహమునకేతెంచి సర్వమును దలిదండ్రులకును నింద్రదత్తునకును బ్రియురాలునకును దాదికిని జెప్పెను.

కొమరుఁడు సెప్పిన దంతయు విని నందనభూపాలుఁ డన్నపానాదుల మఱచి మొదలంట నఱుకఁబడిన కదళీస్తంభములీల భూమిపయింగూలి దుఃఖసముద్రమున మునిఁగి తేలుచుఁ 'బుత్రా! రత్నమండనా! సకలసౌందర్యరాశి వగు ని న్నా యసురపొట్ట నెట్టుబెట్టెదను ? సకలసద్గుణగరిష్ఠుండ వగు నినుఁ జంప నతఁ డెట్లు సమ్మతించెరా? ఆహా! కుమారా! జ్యోతిశ్శాస్త్రముల నమ్మనంటివి. నాపలుకులు ప్రల్లదము లని భావించితివి. పుష్పగంధకయి పరితపించితివి. వల దని చెప్పుచుండఁ జంద్రవర్మ పరమదుర్మార్గుఁ డడ్డు దగిలి యేమేమో వచించెనే? అన్నా! నీప్రాణములఁ దీయ నాపురోహితుఁ డేలఁ దలపెట్టెరా? బ్రాహ్మణులు భోజనసహాయులుగాని కార్యసహాయులు గాదంద్రు. ఇందునకే కాఁబోలు. పుత్రా! నాకుల

వర్ధనా! నవమాసములు మోసి కనిన నీతల్లియు నీకై పరితపిం
చెదు నింద్రదత్తుఁడును నీపదపద్మారాధనతత్పర యగు
పుష్పగంధియు నీమంగళప్రదమగు యాననమే సర్వపాప
క్షయమని యెంచెదు నేనును నీ వాకయసురవాతఁబడిన బ్రదుక
కఁగలమా? నాయనా! అస్మద్వంశముక్తామణీ! ఆ రక్కసుఁడు
సమస్తమహీచక్ర మడిఁగిన నప్పగింతు. నిన్నుఁగాక నాప్రాణ
ముల నర్పింపుమన్న నర్పింతు'నని గంభీరముగ విలపించుచుండ
నాపుత్త్రరత్న మగు రత్నమండనుఁడు 'తండ్రీ! నీ కీవెఱ్ఱిదుఃఖ
మేల? భగవంతుఁ డేరీతిగఁ బుట్టించెనో యారీతిగఁదనలోనికిఁ
దీసికొను నని మీ రెఱుఁగరా? చావునకై వగవనేల? పాప మా
రక్కసుఁ డెంతతపించుచున్నాఁడో నాకై. తలిదండ్రులారా!
దిగులొందకుఁడు. దేనికైన వగవఁదగుఁగాని చావునకుఁగూ
డదు. సత్యవ్రతులయినచో నీశ్వరానుగ్రహమున నస్మాదృశు
లగు పుత్త్రుల నెందఱినో పడయవచ్చు'నని చెప్పి మిత్త్ర
రత్నమగు నింద్రదత్తుం జేరి తాను వెడలఁదలఁచినపయనముం
గూర్చి వచింప నతఁడు ఖేదపూరితమానసుఁడై 'మిత్త్రమా!
రాజనందనా! సమస్తాశ్రమములలో గృహస్థాశ్రమము
దొడ్డది. దీని విడఁచి యరణ్యమున నసుర కాహారమైన నతిథి
నభ్యాగతుల నాదరించువా రెవరు! అగ్నిసాక్షికముగఁ బరి
ణయమాడిన భార్య నోదార్చువా రెవరు? సమస్త మీగృహ
స్థుతోడనే యున్నది గదా!

సీ॥ వేదవ్రతముల నాపాదించి చరియించు
బ్రహ్మచారుల కెల్లఁ బట్టుగొమ్మ

నతిథులై చరియించునట్టి గృహస్థుల
నాదరింపంగఁ గల్పాగమంబు
భార్యైకయుక్తులై వనమునఁ దిరుగు వా
నప్రస్థులకు రక్షణప్రసక్తి
సంసారహింసారిరంసావిరక్తులౌ
సన్న్యాసులకును విశ్రాంతిభూమి
గీ॥ యైన గార్హస్థ్యముననుండి యఖిలకర్మ
ముల నొనర్చి తుదకు ముక్తిఁ బొందవచ్చు
నట్లు కాదేని యవ్వసిష్ఠాదిమునుల
కేల? గార్హస్థ్యముననుండు టెఱుఁగఁ జెపుమ ? "

యని పలుకుచున్న యింద్రదత్తునకు రత్నమండనుఁడు సత్యప్రభావమునుగూర్చి బోధించి యగ్నిసాక్షిగఁ బాణి గ్రహణము సేసిన ప్రతివతాశిరోమణి యగు పుష్పగంధికడ కేగి 'చెలీ! బ్రహ్మదేవుఁడు న న్నొకరక్కసున కాహారము గమ్మనివ్రాసె. నిండుపున్నమచందురువంటి నీయాననమును వీక్షించుట కాపదమ్మగఱ్ఱుఁ డోర్వఁడయ్యె. అయ్యో! ప్రేయసీ! నీతోడ నే ప్రొద్దుపుచ్చినఁ బాప మాదనుజుఁ డెంత తపించునో? విధివ్రాఁత లూరకపోవునా! సద్గుణరాశివై యెల్లటకును దలలోని నాల్కభంగిఁ బ్రవర్తిల్లు'మని ధైర్యదైన్యము లుట్టి పడుచుండఁ బలికి వివాహాగమనోన్ముఖుండుంబలె సుముఖుండై వెళ్లుచుండ నాసీమంతినీలలామయు నతని యనుజ్ఞఁ బడసి ప్రాణములం దక్కించుకొన నెంచి యతని వెన్నంటి వెడలు చుండెను.

కాననముననున్న రాక్షసుఁడు తనమనమున "నయ్యో! ఎంతప్రొద్దుపోయినను దప్పక వచ్చెద నని చెప్పి వెళ్లిన నరనాథుఁడు రాఁడయ్యెనే? ఎంతవినయవిధేయత లతఁడుసూపె? ఎన్నికథలుసెప్పె? ఆహాహా! మానవు లెంతపాపులు! ప్రజలను బాలించు రాజులు పరమదురాత్ములు సుమీ! అందునకే. 'రాజ్యాంతే నరకం ధ్రువ'మ్మని యందురు. రత్నమండనుఁడు న న్నెంత మోసపుచ్చె. ఎన్నఁడు నేరికిఁజిక్కనివాఁడ నేఁడు వీనికిఁ జిక్కితి" నని క్షుద్బాధాపీడితుఁడయి తలపోయుచుండ తఱి భార్యాభర్తలిద్దరు నాతని యెదుటికిఁబోయి నిలువఁబడ నారాత్రించరుండు రత్నమండనుని మ్రింగఁ బ్రయత్నించుచుండ నాపతివ్రతాశిరోమణి వినయవిధేయత లుట్టిపడుచుండ నంజలిఘటించి పెక్కురీతుల నా దనుజుగుణములఁ గొనియాడుచు నతని కరుణకు పాత్రురాలయి పతిభిక్ష పెట్టు మని ప్రార్థింప, నాతఁడు రత్నమండనుని సత్యమునకును పుష్పగంధిపతిభక్తికి మెచ్చి చంపనొల్లనితఱి గోవిందుఁడు ప్రత్యక్షమయి రక్కసునకు దేవరూపముఁ బ్రసాదించి తనలోకమునకుం గొంపోయెను.

పదంపడి రత్నమండనుఁడును పుష్పగంధియుఁ బుండరీకాక్షుఁ బెక్కుతెఱఁగుల స్తుతియించి నిజపురంబునకుఁ జని తలిదండ్రులకును బంధుసమూహంబునకుం దమగమనాగమనక్రమంబు నంతయుఁజెప్పి పరమానందభరితులఁజేసి యొక్కశుభముహూర్తమునఁ బట్టాభిషిక్తులయి చక్కని పాలనమొనర్చుచు సంతానంబు బడసి, యైహికభోగంబు లనుభవింప

నాఁడట గరుడధ్వజుండు కరుణాఘుండయి యా దంపతులఁ గరుణారసప్రీతి విస్తారితవిలోకనామృతమ్ముల సంతర్పితులం జేసి వైనతేయుపయిఁ గూర్చుండ నిడుకొని వైకుంఠమున కరిగెను.

ఓ సుమతీ! సతీమతల్లుల యుత్తమేతిహాసము మతిమంతులకు స్తుతిపాత్రమగుట జగద్విదితము. ఈ యర్థమును పతిదేవత యగు మత్స్యగంధి తనశీలమున సావిత్రీప్రభృతులలీల నొకింత వంతి బతిలియుఁ బతిప్రాణములఁ దక్కించుకొని యువతీతిలక మైనదికదా !



# III

# మిత్రద్రోహము

శ్రీమదఖండభూమండలమండనాయమానంబగు భరత ఖండంబునం దప్రతిమానవైభవసనాథంబై నానాచిత్రవిచిత్రవర్ణంబుల జానొంది యౌన్నత్యంబున సూర్యమండలంబు ఢీకొనుచు రంగారు సౌధపాళీవిరాజితంబై ఖర్జూర కదళీనారికేళద్రాక్షానారంగాదిఫలవృక్షవిభ్రాజమానంబై మల్లికానందివర్ధనజాతిపున్నాగాది పుష్పవాటికాలంకృతంబై శుకపికశారికాదికూజిత మనోహరంబై వేదశాస్త్ర రాజ్య పాలన వాణిజ్య కృష్యాది నైజవిధివిధానదక్షాన్యోన్యసౌభ్రాత్రగరిష్ఠ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రచతుర్వర్ణమండితంబై పురీమతల్లి యగు నుజ్జయినీపురంబు కరంబు రాజిల్లు.

అప్పురంబున సంపత్సమృద్ధి నలకాధీశు నధఃకరించుచు వైభవసమృద్ధి నింద్రు నీసడించుచు జయంతనలకూబరులో యన నిద్దఱు వర్ధమాన విష్ణుగుప్త నామధేయంబులఁ జెన్నలరారు వణిగ్యుగ్మం బన్యోన్యస్నేహాలవాలంబై వెలుంగు.

ఒక్కనాఁడు విష్ణుగుప్తుఁడు వేఁకువ మేల్కాంచి కాల్య కృత్యంబులు నిర్వర్తించి కులదైవంబు నారాధించి సముత్సాహంబున మిత్రసత్తముండగు వర్ధమానుదరి కేగి, 'సుహృన్మణీ! వార్తావిశేషం బొక్కండు విని నీచెవిని వేయ నేఁజనుదెంచితి. అదేమంటివా? జీనఁపుదీవి నినుమునకు నిబ్బడి బంగారు సాటాబేరము జరఁగుచున్నదని. ఈవిషయ మతిగోప

నీయము. కొన్ని కలంబుల నినుము నెగుమతిఁజేయింప సమ కట్టి నీతో సంప్రదించితి. ఈయెడ నీయభిప్రాయమెద్ది? సత్వరం బుత్తరం బిమ్ము. ఆర్య "లాలస్యా దమృతం విష"మ్మం డ్రుగదా! వాణిజ్యరహస్యాగమవేదివగు నీ కొరులకుంబోలె మిక్కిలి నొక్కి వక్కాణించుట పిష్టపేషణం బగును నెను.

సజ్జనమూర్ధన్యుఁడగు వర్ధమానుఁడు చెలికాని మా టలు సాకల్యంబుగ నాకర్ణించి తనలో 'నాహా! ఏటివింతగ నున్నది! నిన్న మొన్నటివఱకు నుత్తరప్రత్యుత్తరములు వచ్చుచుఁ బోవుచునే యుండెనే యింతలో నింతధర యెట్లు పెరిగె? పరికించిచూడ నచ్చెరువయ్యెడు; నయినను మఱల సందియంబు వాపికొనియెద'నని తలఁచి 'విష్ణుగుప్తా! నీకెవరీ వర్తమానము దెచ్చిరన్నా? ప్రస్తుత మిట్లు ధర పెరుఁగుటకుఁ గల కారణము తెలియదుగదా!' యని ప్రశ్నింప నతఁ'డన్నా యేల నీకీ వెట్టిప్రశ్న? గుట్టమెగురుటయు మేఘముఱుముటయు నాడుదాని నడువడియు మగవానిభాగ్యంబును వాన గురియు టయు ధరపెరుగుటయు జననమొందుటయు మృతిజెందుటయు దేవతలునయిత మెఱుంగరన మానవులమగుమనమెట్లెఱుంగఁ గలము? కాలయాపనం బొనర్చిన నుంతయులాభముండదు. నేను నేఁడే కలముపయి నాదుపదిబారువులలోహమును వేసి కొని పయనమయ్యెద; నీఁక నీయిష్టమునుమీ! చిరకాలము నుండియు నీకును నాకును గల మైత్రింజేసి యింతగఁజెప్ప వచ్చితి. దబ్బఱలాడ నాకొంప మునిఁగినదా?' యని గంభీర స్వరమున నమ్మకము బుట్టించుమాటల నాడెను.

మిత్రుఁడగు విష్ణుగుప్తుఁడు నుడివినదాని నంతయు వర్థమానుఁడు గ్రహించి, 'చెలికాఁడా! చూచితివిగదా నాదు దేహస్థితి! వారము దినములనుండియు జ్వరపీడితుఁడనయి యన్నమన్న నెట్టిదియో యెఱుఁగక నోఁట యీఁగ జొచ్చినను తెలియకున్నది. సరియె, లాభమో నష్టమో నీతోఁబాటు నాదియు నొకకలముపయి వేసికొనిపోయి నా సేవకులఁజక్కఁగఁ జూచుకొని సుఖంబున ర'మ్మని వాక్రుచ్చెను.

కొంతతడ వాలోచించి ధైర్యము సెప్పువాఁడువోలె 'వర్థమానా! దీని కింత దిగులా? నేనన్న నొకటి నీవన్న నొకటియునా? శ్రీమన్నారాయణాంశసంభూతుఁడగు చతుర్ముఖుఁడు మన కిరువురకు రెండు దేహముల నిచ్చెనే కాని యాత్మయొక్కటియే యని యెంచుము. నేను నీకుఁ గ్రొత్తనా? అదియునుంగాక మిత్రమా! ఇట్టిలాభముగల బేరము జేఫుండునా యని తలఁచి నిను వదలి వెళ్ళవలసివచ్చినందుల కెంతయు విచారమయ్యెడు. అరుగరుగో మనుష్యులు నాకయి వచ్చుచున్నట్లున్నది! త్వరలోఁ బోయివచ్చెద. భగవంతుని కృపావిశేషమున నతిశీఘ్రకాలములో సుఖంబుండుదువుగాత' యని నచ్చఁజెప్పి వర్థమానుని యనుచరు లతనికలంబుతో వెంటరా సంద్రమున బయన మొనర్చుచుండెను.

గృహముపీడిన కతిపయదినములకు జీనఁపుదీవిఁ జేరి యచ్చట బేరమాడఁ దన కిరువది బారువుల సువర్ణమును వర్థమానునకు నలుబదిఫుట్ల బంగారును రాగా నతం డమందానంద భరితుఁడయి, 'యాహా! ఏమి మాయదృష్టము! పుట్టినఁగోమట్ల

లోఁ బుట్టవలె నందు రిందునకే కాఁబోలుసుమీ! ఏమా
నవుఁ డిట్లితరవ్యాపారమున నొక్కతూరి భాగ్యశాలి కానోపు.
పాడై, నాయొద్ద లోహము పదిబారువులేగాదా! వర్ధమానుఁ
డెట్లు సంపాదించెనోకదా యిరువదిబారువులు? అనవస
రంబుగ వర్ధమానునకే నలుబదిబారువుల సువర్ణము
నెట్లిత్తు? చూడఁ జూడ మిక్కిలిగఁ గన్నులు కుట్టుచున్నవి.
ఏమి యీ బంగారుకళ? దీని నేనపహరింప నొక్క యుపా
యంబు తోఁచెడు. మార్గమధ్యమున మన్మిత్రునిసనుచరుల
నెల్లఱ మత్పరివారంబున కొంకింత ద్రవ్య మాశఁబెట్టి యగాధ
మగు నంబుధిఁ బడఁద్రోయించెద. వార లియ్యకొన
కుందురా? ఏల? ఎవరి కీప్రపంచమున ద్రవ్యమన్న
నాశలేనిది? "ధనమూల మిదం జగ" త్తండ్రుగదా! కనుకనే

"జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యఁ గూర్పఁ దలఁపవలయు"

నని యార్యు లుద్బోధింతురు.

దుర్మార్గఁపు టాలోచనలుగల విష్ణుగుప్తుఁడు గృహాభి
ముఖుండయి తన సేవకులకు నాలుగుబారువుల కనకంబు
నాశఁబెట్టి మిత్రుని సేవకుల నెల్లఱఁ దోయములఁ ద్రోయించి
సకల శోభాయమానం బగు నుజ్జయినీనగరప్రాంతముం జేరి
పరిసరారణ్యమధ్యంబున హిరణ్యంబు సర్వంబు భూగుప్తం
బొనరించి "పెన్నిధిఁగోల్పోయిన పేద" వోలె దుఃఖాక్రాంతుఁ
డయి దారిద్ర్యమున తట్టుముట్టాడెడివదనముతోఁ దొట్రుపా
టువడుచు వర్ధమాను గృహంబున కేగి యెలుంగునెత్తి యేడ్చు

చుండ, నతఁడు లోనుండి వెలి కక్ష్యాంతరంబులు దాటివచ్చి 'యేమి విష్ణుగుప్తా! బిట్టువగచెద'వని యడుగ విష్ణుగుప్తుఁడు నేత్రము లెఱ్ఱబారఁ జొటచొటఁ గన్నీరు గార్చుచుఁ 'జెలి కాఁడా! ఇంకేమని తెల్పుదు? మనకొంప గుభాలున గూలి న'దని శోకమ్మువ్వళించుకొనుచుండ 'నాహా! ఇతఁడేమి యిట్లు వలుకుచున్నాఁడు. మున్నుం దే నెంత మనంబున నదియంబు బడి తినో యంతజరిఁగినది. కాని మిన్నఁక నీతఁడేమి చెప్పఁదలఁచెనో చూచెద'నని తలఁచి ధైర్యమూని 'వయస్యా! విష్ణుగుప్తా! ఏల వగచెదు. "గతజల సేతుబంధనంబు"నం గల లాభమేమి? గతించినదానికయి నీవి ట్లుదరంబు బ్రిద్దలగున నేడ్వఁ దగునే? తగదు తగ దూరుకో. ధైర్యముగొని జరిఁగినదానిఁ జెప్పుము. ఎవరికిగాని దైవము ప్రతికూలమైనప్పు డిట్లుకాక మానదు. అందులకు వెనుబడవచ్చునా? ఏకాలమున కేది రానున్నదో యది రాకమానదుగదా!' యని యోదార్పు మాటలు వలుక, విష్ణుగుప్తుఁడు తనమాయోపాయము చక్కఁగాసాగునని మాయఁపు శోకంబు బదిలపఱచుకొని 'వర్ధమానా! నే నేమని వచింతు. మనయిరువురిలోహము నీనఁవు దీవింగల భద్రింబగు నొకగేహమున బదిలపెట్టి తాళములు వైచి బేరమాడుటకే విపణికి వెడలి మగిడివచ్చునరికి లోహమావంతయైనఁ గన్పింపదయ్యె. అంతఁగడుంగడు దీర్ఘకాలము విచారించిచూచి యయ్యో! ఇదేటిగతి. సమస్తలోహమును నెలుకలరాఖుడి వాతఁగొట్టి గేహమున కేళ్ళగుదునా యని తలఁచి చిట్టచివఱ కెట్లో యిచ్చటకు వచ్చితి. మిత్రరత్నమా!

నాకును నీహృదయంబు తెలియు. నీ వితోపులవంటివాఁడవుగా,
వయిసను ప్రపంచములో నెట్లనకొంచురా తండ్రీ! "లో
కులు పలుగాకు"లని వచించెదరుగదా! నాసొమ్మంతయువా
పదిబారువులు మాత్రమే. అబ్బా! విష్ణుగుప్తుఁడు నన్ను
నమ్మి సంగడీఁ డియ్యగా లోహము నపహరించె నని యంద్రు
గదా! నిజాని కానాఁడు పరమమిత్రుఁడ వగు నీచెప్పెడి
హితోక్తులఁ బెడచెవింబెట్టి సంద్రమునఁ బ్రయాణమేల చేయ
వలసినచ్చె? ఎంతదురదృష్టుఁడను? నాయట్టివానికా మాట
దక్కుట! ఆబాల్యప్రవర్ధమానమగు మావచెలిమికి పాడయిన
ప్రయాణ మెన్నండెయుఁగని కళంక మొక్కండు దెచ్చిపెట్టెనే?'
యని పలుతెఱంగులఁ జింతాకులితమానసుండుం బోలె పలికి
యింటికివెళ్లి వచ్చెద ననిచెప్పి నిజగృహముం జొచ్చెను.

సద్గుణరాశియగు వర్ధమానుఁడు ధనం బపహరించిన
దుష్టచిత్తుఁడగు విష్ణుగుప్తుం బొల్లుమాటలాడక యుల్లంబునం
దల్లడమంది 'యేమి యీవింత! దుర్మార్గులగుణము లిట్టి
లుండుఁగదా! అందులకే మాన్యులు "నీచాః కలహ మిచ్ఛన్తి
సన్ధి మిచ్ఛన్తి సాధవ" యంద్రు. వీని నెట్లేనిఁ దగిన యుపా
యంబున వంచించెద. "మాయకులయెడ మాయావియయి
ప్రవర్తింపవలయు" ననెడి యార్యోక్తి స్మరించి తొల్లియట్లు
మెలంగుచు సమయమునకు వేచియుండెను.

ఒక్కనాఁటి సాయంసమయమున వర్ధమానుఁడును
విష్ణుగుప్తుఁడును ముంగిటిలోన్నెపయిఁగూర్చుండి ముచ్చట
లాడెడుతఱి విష్ణుగుప్తుని ముద్దులబిడ్డఁడు గజ్జెయలు గల్లు

గల్లున మ్రోఁగ సన్నగిల్లుచుఁ బరుఁగుపరుఁగున నప్పకడ కేగి 'యయ్యా! ఆవలివీధిన నేవియో పండ్లమ్ముచున్నారు. నాకుఁ గొన్నియిప్పింపవే'యని యడిఁగిన ముద్దులబాలకుని వర్ధమానుఁడు 'బాబూ! ముకుందము!! నే నీకిప్పించెదనిమ్మని సంతోషమున జంకనిడికొని వెడలిపోయి స్వగృహముఁ బ్రవేశించి యొక్కగదియందు భద్రపఱిచి మధురపదార్థము లందించి యటునిటుఁ దిరుఁగాడఁజొచ్చెను.

సూర్యుం డస్తంగతుం డాయెను. సరోవరనీలజలంబుల పయి నీలచ్ఛాయ వ్యాపించుకొనెను. విహంగంబులన్నియు మగిడి కులాయంబులఁ జేరఁజొచ్చెను. అంధకారమంతట నావరించెను. చంద్రమండలము నక్షత్రమండలితో గండుమీఱి పండువెన్నెలఁ గాయుచుండెను. ఆవుదూఁడ లంబా యని తమ తల్లులకడకు గంతులతో వెడలుచుఁ జూపరులకుఁ గడువినోద మొసంగుచుండెను. పురంధ్రీమణులు కరకలితకంకణఝుణఝుణత్కారంబులు మిన్నుముట్ట గోక్షీరంబులు పితుకుచుండఁ బసిండి పాలగిండియలలో సుధాకరుండు తన్నాహ్వానించిరో యన్నట్లు సాక్షాత్కరించెను.

విష్ణుగుప్తుఁడు తనముద్దుకొమరుండు ముకుందుం డిల్లు సేరమింజేసి చిత్తంబు స్వస్థలంబుఁ దత్తరించుచుఁ బుత్రాన్వేషణార్థియయి వర్ధమానుని గృహమున కేగి, 'సఖుఁడా! ముకుందుఁ డేడీ?' యన 'నన్నా! విష్ణుగుప్తా!! నే నేమని వాక్రుత్తు. నానోట మాట రాకున్నది. వీథివెంట జంకనిడికొని నే వెడలునప్పు డొక పాడయిన టక్కరిగ్రద్ద యొక్కండు బలాత్కరించి

వస్తు వొకచోట యనుమాన మొకచోట యన్నట్లు దమకు
దమకుఁ గయ్యము లున్నచో ముక్కుపచ్చలారని ముద్దుల
ముకుందుఁడేమి దోస మొనర్చె నని వర్ధమానుఁడు పసిబాలకు
దాఁచిపెట్టు? ఇఁక విష్ణుగుప్తు సాధించు నుపాయ మొండు
లేదా ?' యనియు ననుకొనఁ జొచ్చిరి.

దుర్వారక్రోధభీషణుఁడగు విష్ణుగుప్తుఁడు తండోపతండ
ములు గుమిగూడియున్న జనులనుండి ధర్మమున కొడిగట్టుకొని
యున్న వర్ధమానుని కరద్వయంబుఁ బట్టుకొని న్యాయాధికారిం
గలిసికొని ప్రణమిల్లి 'యీతండు మత్ప్రియసూను నాభరణేచ్ఛ
నెందేని మోసగించి గృధ్రంబొక్కండు తన్నుకొనిపోయె నను
చున్నాఁడు. ఈపాపి పన్నిన మాయోపాయమును జక్కఁగ
బరిశీలించి ననుఁ బ్రోచి నాముద్దులబాలు నా కప్పగించునట్లు
సేయవేఁడెద' ననవుడు న్యాయాధికారి వర్ధమానునిం గని,
'యోయీ! నిను బలాత్కరించి యిటకుఁ గొనితెచ్చిన విష్ణు
గుప్తుఁడు వచించిన యర్థంబెల్ల వింటివికదా! నీ వేమైన చెప్ప
కొనఁదలఁచినచోఁ జెప్పు' మని యనుజ్ఞనియ్య వర్ధమానుఁడు
కరంబుల జోడించి, 'మహాప్రభూ! సర్వజ్ఞులరగు దేవరవారికే
వానిగుణం బెట్టిదియో తెలియరాకుండునా? నేనును నీముచ్చ
టించిన విష్ణుగుప్తుండును గరంబు మైత్రి మెఱయ నిరపాయ
మగు నుపాయమున వర్తకంబు సలుపుచుందుము. ఒక్కనాఁ
డీతఁ డెంతో యాతురతతో నాకడ కేతెంచి జీనఁపుదీవియం
దినుమునకు పాలునకు రెండుపాళ్లు బంగారు నిచ్చుచున్నారని
వ్యాధిగ్రస్తుఁడనయియున్న నన్నుం గరంబు ప్రేరేచి మత్సే

వకుల వెంట నిడికొని, యిరువదిబారువుల లోహముంగొని, వెడలి, మూఁడు నెలల కిలుసేరి, లోహంబంతయు నెలుకల వాతఁబడెననియు సేవకు లంబుధిం బయన మొనర్చుతఱి విష జ్వరపీడితులయి మడిసి రనియుం జెప్పి సన్నంతయు మోసగించె. అట్టియెడ వీని ప్రియనందను నొకగ్రద్ద తన్నుకొనిపోయె నను టయం దాశ్చర్యమేమో సెలవిం' డని వినయముట్టిపడ విన్న వించెను. న్యాయాధికారి ముక్కుపయి వ్రేలుపెట్టుకొని నిశ్చే ష్టుఁడయి కొంతతడ వూరకుండి సేవకులవైపు దృక్కులఁ ద్రిప్పుడు, వార లెదుట నిలిచి దేవరసెల వెయ్యది యన మీర లీక్షణంబ విష్ణుగుప్తుని ముక్కునకు నీ రెత్తుఁ డన వా రట్లు సే యఁగఁడంగుఁడు, మొదలంట నఱకఁబడిన కదళీస్తంభములీలఁ బ్రభుపాదములం బడి మిత్రుఁ డగు వర్ధమానుఁడు వచించిన దెల్లయు నిజమనియు నీఁకముం దెన్నం డట్టికార్యములకు గడంగననియు నీతప్పు సైరింపుఁడనియు మొఱపెట్టుకొను చున్న తుచ్ఛవైశ్యు నావలకుఁ దోఁయించి వర్ధమానున కతని పసిండి నిప్పించి ముకుందుఁ దల్లి కప్పగింపఁ జేయించి దురాత్మ గునకు తగినశాస్తిఁ జేసినగాని లాభము సేకూర దని మనంబున దృఢంబుగ నిశ్చయించి కుతంత్రుఁ డగు విష్ణుగుప్తుఁ గారా గృహనిబద్ధుం జేయించి తన్నెల్లఱు వేనోళ్ళఁ బ్రశంసింపు చుండఁ జక్కని పరిపాలన మొనర్చుచుండెను.

ఓ చదువరీ! మిత్రద్రోహమువలన నిహపరములకు దూరులమై విష్ణుగుప్తురీతి నర్థమును మానమును గోల్పోదు మని యెఱుంగునది.

---

# IV

# విద్వన్మాహాత్మ్యము.



అనుపమానశోభాసనాథంబైన మద్రదేశంబున మాణిక్యశర్మ యను విప్రోత్తముఁ డొక్కరుండు గలఁడు. ఆతఁడు తపస్స్వాధ్యాయసత్యబ్రహ్మచర్యముల శ్రద్ధాభక్తులతో జరుపువాఁడు. మఱియు నతండు బహుదేశాటనంబు సలిపి బహువిద్దెలనేర్చినవాఁడు. గ్రామమునంగల విప్రబృందమున నతఁడు మేటియై సర్వజనసమ్మతంబుగఁ గాలము గడఁపుచుండు. జితేంద్రియుండును మాతాపితృభక్తుఁడు నన నాతఁడె యనఁదగు. ధర్మరతుఁడై యెల్లకులజాల నొక్కభావమున జూచుచు నతఁడు నెల్లఱకుఁ దలలోని నాల్కవలెఁ బ్రవర్తిల్లుచుండు.

సర్వమున్నను మృతసంజీవిం బడయనెంచి యాద్విజుఁడు తనసతికిఁ బ్రియంబుమీఱ నిట్లనియె—'వింటివా, వాల్గంటీ! నేఁటిరాత్రికి యిలువిడఁచి దుర్గమంబగు నొక్కయరణ్యంబునకు సని ఘోరతపంబుఁ గావింప మనసయ్యెఁడు. ఎన్నిభాగ్యభోగ్యములున్నను నవసానమున కుపయోగపడవుగదా?' విప్రనారీరత్నమగు ప్రభావతి భర్తపలుకుల నాకర్ణించి 'నాథా! తమరు మక్కువంబున వక్కాణించు చక్కనివాక్కు నాకెఱుఁకపడదు. అంత్యదశనుగూర్చి నేఁడే ముచ్చటింపనేల? మన మీభూతలమున కేతెంచినపుడేమైనఁగొనివచ్చితిమా మఱలఁగొనిపోవుటకు? సర్వము నెఱిఁగిన తమ కెట్టి సందియము

పోఁడమె? బ్రతుకు కొలఁదికాలమును నెల్లలకు దూరమై విపిన ముల వసించెద ననుట తమకే గ్లైనా?' యని దీనగద్గదస్వరయై పలికెను.

మానవజన్మము తృణప్రాయమనియు దాని భగవదా రాధనమువలన చిరకాలస్థాయినిగా నొనర్పవలయుననియు నా భూసురుని దృఢసంకల్పములుగాన యెట్టకేలకు బిట్టుగఁ దన పయనమునకయి వగచుచున్న వగలాడిం గాంచి 'మగువా! వెడలివచ్చెద సుఖం బుండుము. దైవము నీకును నాకును నీడ. తిరిగి వచ్చితినా భువనంబును జయించు దివ్య వరంబును దెచ్చెద. భగవదారాధనము నిరర్థకంబు గాదు గదా!' యని పలుకుచు గృహము వీడి పరిసరారణ్యప్రాంత ముల నేగుచుండెను.

సర్వలోకైకపురుషుఁడును దీనజనపోషకుండును నార్త త్రాణపరాయణుండును నగు శ్రీ వైకుంఠవాసుఁ డా భూసురాభరణము మనోనిశ్చయము బరీక్షింప నెంచి వృద్ధ విప్రునిరూపుఁదాల్చి చేత దుడ్డునొక్కటి బూని గజ గజ వణఁకుచు 'హరిహరీ! నా కెంత దురవస్థ వాటిల్లె. ఎంత సుకృతమొనర్చిన వారలకో పుత్రులు పుత్రికలు పౌత్రులు. నాబోఁటి దరిద్రునకా? ఈ కాననమధ్యమునఁ గన్నులు గానరాకున్నవిగదా! అహా! ఏమిది? వార్ధక్యము నకుఁ దోడీయంధత్వ మబ్బెనా యనిలుఁ డనలునకుఁ జేదోడైన నట్లుగ నుండును. ఎంత ఘోరపాప మొనర్చిన నా కీ గతి పట్టవలయు? సమస్తము మనహస్తముల నున్న దని విట్టివీగు

దుము. అన్నియు వ్యర్థములు సుమీ ?' యని బిగ్గరగఁ బలు
కుచు మాణిక్యశర్మను గలిసికొనెను.

మాణిక్యశర్మ వృద్ధబ్రాహ్మణునివచనములు వినుచు తన మనమున, 'నన్నా ! నే నెందు కీప్రపంచమున సృష్టింపఁ బడుట ? కామక్రోధమహామకరసంకీర్ణంబయిన యీ సంసార మెన్నికష్టపరంపరలకు గురి కావలయును ? ఆహా! నాయూహ కడుదొడ్డది. త్వరితముగ మేల్కని సంసారమును విసర్జించితి. అబ్బా ! ఈ వృద్ధుని కెట్టి యిక్కట్టు లుప్పతిల్లె. "అంత్యదశ లావు దుఃఖమండ్రు" విందులకే గాఁబోలు ! యావత్ప్రపంచమున నేజీవి యుత్కృష్టమైనదిగఁ బరిగణింపఁ బడునో దానికేగదా యిన్ని యిక్కట్టులు ! తక్కుంగల జీవరాశిస్థితి యికెట్లుండును ? మృత్యువును జయించుటకు నా కీశ్వరుఁడు సాయపడుగాఁత' మని చింతించి యిట్లు సంభాషించు—

'అయ్యా ! నమస్కార మిదే.'

'నాయనా ! నీ వెవరు ? నానేత్రములు గానరాకున్నవి. శుభమగుగాఁత!'

'బాబూ ! నే బ్రాహ్మణకులజుఁడను; మాణిక్యశర్మ యందురు.'

'ఎక్కడకు నీ విటు వెడలుట ?'

'అరణ్యములకు.'

'ఎట్టెట్లూ! యరణ్యములకా? ఏమి నీధైర్యసాహసములు? గృహముకడనుండి భగవంతుఁ డిచ్చినదాని ననుభవింపక కాననముల నీ వేమి గాంచెదవయ్యా? రా! యింటికి పోవుదము.'

'స్వామీ! తొల్లి ఋష్యాదులు మనలేదా?'

'సరియె సరియె. నీ కీపయనముపయి కోర్కి కడుదొడ్డదిగ నున్న ట్లున్నది. చూడ నడివయస్సున నున్నాఁడవు. నీ కీ తపములేల?'

మాణిక్యశర్మ కాలవ్యవధి యగునని చాలగ మనమున దలఁపోసి విప్రుతోడఁ ద్వరితగతి సంభాషణ ముగింప నెంచి-

'అర్యా! ఎన్నిపనులు సేసినను నిరర్థకములెగదా?' యనఁడు బ్రాహ్మణరూపమున నున్న పరంధాముఁడగు వైకుంఠవాసుఁ డా బ్రాహ్మణునితో 'నాయనా! నిరర్థకము కాని దిలం గానము. ఏ భగవంతునివలన సృష్టింపఁబడినదో యాభగవంతునిలో నైక్యమగుచున్నది. అం దాశ్చర్య మే మున్నది? మృతికి లోనుగాని దెవరు? సృష్టికర్త యగు బ్రహ్మకును బోషణప్రభుఁడగు శ్రీమన్మహావిష్ణువునకును లయకర్తయగు నీశ్వరునకును మాత్రము మృతి తప్పుననుకొంటివా? మానుము, నీ వెఱ్ఱి వెంగళప్ప వేసములు. రమ్ము నాతో ర' మ్మని ధైర్యమానసుఁడయి యాతనిగృహాభిముఖుఁ గావించు నుద్దేశముతోఁ బలికెను.

ధర్మనిరతుఁడగు మాణిక్యశర్మను వృద్ధబ్రాహ్మణుఁడు మరల్పఁ జాలకపోయెను. ఎన్నిప్రయత్నము లుపయోగించి నను నవివేకునియందు హితవుంబోలె నన్నియు నిరర్థకంబు లయ్యెను. శ్రీయాదిలక్ష్మీశుఁడు కొంతదూరము నని యొక్క పొదచాటున మాయమగుట మాణిక్యశర్మ కన్నులార వీక్షించి 'ఆహా! నే నెంతదురదృష్టుఁడను? శ్రీమన్నారాయ ణుండును నాదిమధ్యాంతరహితుండును దీనజనోద్ధారకుండును నగు భగవంతుండు నామనంబుఁ బరీక్షింప నేతెంచెఁ గాఁ బోలు! లేకున్న నింతలో నదృశ్యుఁడు కాఁగలఁడా? అయ్యో! నే నెంతయో ధిక్కరించి మాటాడితినే! పెద్దయనియైన గార వింపనైతి. ఎంతపాప మొనర్చితి? ఎంతదోస మొడిఁగట్టుకొం టి? ఏభగవంతుఁడెల్ల లోకములకుఁ దండ్రియో యేమహాతేజ స్సంపన్నుఁడు పరస్పరసంబంధముగల చేతనాచేతనపదార్థం బులతోఁ జిత్రవిచిత్రముగా సృజింపఁబడిన యీ పంచభూతా త్మకంబగు నఖండప్రపంచమునకుఁ గర్తయో, యేజగద్వ్యాజ మానుఁ డవిచ్ఛిన్నప్రభామయంబులై యహర్నిశ లేకరీతిగా వెలుఁగు సూర్యచంద్రనక్షత్రాది తేజస్సుల సృజించి ప్రాణా ధారభూతం బగు వాయుభూతంబుఁ బుట్టించెనో, యట్టి సర్వ వ్యాపిని సర్వజ్ఞుని నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుని నవిచ్ఛిన్న భక్తితోఁ ద్రికరణశుద్ధిగా ధ్యానించుభాగ్యము నే నోఁ చుకొననైతి. ఎన్నిశాస్త్రములు నేఁ జదివి యేమిఫలము? కనుదమ్ములయెదుర గన్పట్టిన కంజాక్షుని, కడుపుదణుఁ గుకొనిపోవునట్లు ప్రగల్భము లాడితి. కాని యిఁక నేఁజేయు.

న దేమున్నది? "గతజల సేతుబంధనము" వలనంగల ప్రయోజన మావంతయులేదుకదా! మఱియు నే నాపుండరీకాక్షు నేమని దూషించితి? మానవజన్మ నిరర్థకమైనదనియు, దానిపయి నా కిచ్ఛలేదనియుఁ బలికితిఁగాఁబోలు! ఇందు దోస మేమి? సర్వలోకైకపురుషుఁడగు జగన్నాథుఁడు నాదోసఁగుఁలఁ దోసిపుచ్చుగాక' యనుచు నరణ్యమును బ్రవేశించెను.

భూసురాభరణమగు మాణిక్యశర్మ యనుదినంబును వేఁకువజామున మేల్కాంచి నిష్ఠాగరిష్ఠుఁడయి తపంబు సలుపుచు నైదుదినంబుల కొక్కతూరి కందమూలాదులఁదినుచు మొదటిమాసంబున, బదిదినముల కొకసారి తృణపర్ణముల భక్షించుచు రెండవమాసంబున, బదునైదు దినముల కొకపర్యాయము వాయుభక్షణంబు సేయుచుమూఁడవమాసంబున, నాలుగైదాఱుమాసముల నేపదార్థంబునొల్లక, సర్వలోకములకు మాతయుఁ ద్రిమూర్తులకుఁ బ్రసన్నురాలును దీనులకుఁ గల్పతరువును నగు దుర్గను బ్రత్యక్షము సేసికొనెను.

విప్రరత్నము భయసంభ్రమమ్ము లొక్కుమ్మడి బయలువడఁ దొట్రుపడుచు గద్గదస్వరంబున 'తల్లీ!' యని పిలిచెను. దరహాసచంద్రికాసుందరవదనారవింద యగు నగ్గిరీంద్రనందిని, 'నాయనా! నీకోర్కె యెయ్యది? ఏ నీతపంబునకుఁ గడుమెచ్చితి. యుక్తవయస్సురాకమున్నె విద్వేషరాగాదుల వదలి ధర్మమూర్తివై పటుత్వంబున పెక్కుదినంబులు ఘోరతపంబొనర్చి నన్ను సంతోషింపఁజేసితి' వన, నాధరణీ

సురోత్తముఁడు కేలుమోడ్చి 'అంబా! నాకోర్కి నీ వెఱుఁ
గుదు. జగజ్జనని వగు నీ కీజగజ్జాలంబుల నాతంకంబుగలదే?
బ్రహ్మాది దేవతలు కోరరానిదేఁ గోరుచుంటి; నయ్యాది
మృతసంజీవిని. శ్రీమత్సింహాసనేశ్వరి వగు నీవు కరుణించిన
మజ్జన్మసాఫల్యపాత్రం బగు' నని వేఁడెను.

హరిహరహిరణ్యగర్భులఁ గన్న పరాభట్టారిక తన
డెందమున, 'నేమి యీభూసురునికోర్కి! మౌక్తికము, పద్మ
రాగము, వజ్రము, ప్రవాళము, మరకతము, నీలము, గోమేధి
కము, పుష్యగారము, వైదూర్యము నను నవరత్నములఁ గోర
రాదా? సామ్రాజ్యంబు లగు రాజ్యభోగంబు లర్థింపరాదా?
అభ్యర్థనీయంబులు పరశ్శతంబు లుండ నీపండితమన్యున కీ
వరంబేల? మృతసంజీవిని నేఁ బ్రపంచమును మృత్యువాతఁ
బడకుండ నిలుపఁగలఁడేమో? ఏమి వీనివాంఛ? ఎల్లకాలము
తానే తనదారపుత్రములతో నుండవలయుననియా? అట్లు
విచారించినను సంతానంబు సున్న. ఇంక నెందులకీ బాపని
కింతయాశ? కాని మిమ్మాతఁ డిద్దానివలన నెంతకాలము జీవిం
చునో చూచెద. తొల్లి బ్రహ్మనుగూర్చి తపంబొనర్చి పెక్కు-
వరంబులఁ బడసిన హిరణ్యకశిపుఁ డెన్నాళ్లుండె? దీని నొక
యుపాయంబున నిచ్చెద' నని తలఁచి 'భూసురా! ఇవిగో కొన్ని
పచ్చనిపత్రంబుల నిచ్చెదఁగొనుము. నీ వేశవమునకుఁ బ్రాణ
మీయఁదలఁచెదవో దానిపయి నీయాకులలోఁ గొన్నింటి
రసంబుఁ బిండు, ముత్తరక్షణంబ యది యుజ్జీవించు' ననుచు
నాసింహవాహ పత్రములఁ బ్రసాదించి యంతర్ధానమయ్యెను.

మాణిక్యశర్మ యమందానందభరితుఁడయి దేవి యనుగ్రహించినయాకులమహత్తున కచ్చెరు వందుచు 'నే ధన్యుఁడ నైతి. ఏతల్లికై యహర్నిశలు దప మాచరించితినో యా భువనమాత నాయందుఁ గల సంపూర్ణానుగ్రహముచే నీపత్రముల నా కిచ్చె' నని ముఱియుచు గృహాభిముఖుఁ డాయెను.

బ్రాహ్మణోత్తముఁడంబచేఁ బ్రసాదింపఁబడిన యాకులఁ గొని మార్గమధ్యమున నా పత్రముల దివ్యశక్తిఁ గనుఁగొనఁ గుతూహలుఁడై యటునిటు నలుదెసలఁ బరికించెను. కాని యెయ్యదియుఁ గానరామిం దన మనంబున, 'నేమిది? కడు వింతగఁ గన్పించెడు. ఎటు పరికించినను నొక్క జీవి కన్పించదు. దివ్యశక్తి నా హస్తముల నంటవలసనా యేమి! లేకున్న నెటుఁజూచిన వివిధాలంకారశోభితంబయి నానా వర్ణములవారితో నానందమున నొప్పు నీ భువిని మచ్చునకైన మనుజుఁడు గానరాఁడే?' యని పెక్కు తెఱఁగులఁ దలపోయుచుఁ బ్రాణములఁ గోల్పోయి యొక్క పొదకడఁ బడియున్న పుండరీకంబు నొక్కండుం గాంచి 'బళిరే! నా పుణ్యంబు పండె. నా మనోరథంబు లీడేరె. నే ధన్యుండనైతి. అంబ ప్రసాదించిన పత్రములశక్తి నిటనె పరీక్షించెద. "నాలస్యా దమృతం విషం" మండ్రుగదా మాన్యులు! ఇంక నే నేల తడవు సేయవలయు'నని "వినాశకాలే విపరీతబుద్ధిః" అన్నట్లు దుష్టమృగమగు నా వ్యాఘ్రంబువలనఁ దనకుఁ జావు గలుగునన్న మతిలేక సత్వరము నా దళముల నస్ఖలితం

బుగఁ బిండ, నా శార్దూల మతిదారుణంబుగ గాండ్రించుచు నా విప్రునిపైఁబయింబడి వాని మృతుని గావించెను.

భర్తయగు మాణిక్యశర్మ గృహము వీడినదాది యను దినంబు నుమామాహేశ్వరులఁ దన డెందమున నిలిపి నిష్ఠాగరిష్ఠురా లయి దేవపూజ లొనర్చుచు భర్తరాకకయి యెదురుచూచుచున్న ప్రభావతి కొక్క నాఁటిరేయి నాలవ జామున హైమవతి కలలోఁ బ్రత్యక్షమయి మాణిక్యశర్మ దేవియనుగ్రహంబునఁ బత్రములఁ బడయుటయుఁ బడంపడి యతఁడు వానిం జచ్చినబెబ్బులిపయిఁ బిండుటయు నద్దాని వలన నతండు హతుఁడగుటయు మృతినొంది పడియున్న స్థలంబును, నాదిగాగల సర్వవృత్తాంతంబు నెఱిఁగించి యదృశ్య యగుడు, నాపతివ్రతాశిరోమణి పరమేశ్వరి చెప్పిన తావున కేగి యంబికాప్రసాదితావసిష్టపత్రముల భర్త్రు కళేబరంబు పయిఁ బిండి సజీవుగ నొనర్చుకొని స్వగృహమున కేగి చక్కఁగఁ గాఁపుర మొనర్చుచుండెను.

పాఠకోత్తమా! ఎన్నివిద్దెలనేర్చి విద్వాంసుఁడయినను వివేకించు తెలివిలేకుండెనేని యవియన్నియు మాణిక్యశర్మకుం బలె నిరర్థకంబు లగు.

క॥ మతియ కళాకృషి బీజము
మతియ తన ఫలప్రపత్ని మాజము తలఁపన్
మతియ చెలి మతియ చుట్టము
మతిహీనులు చూడ మొరడు మాకులు ధాత్రిన్.



# V

## అతిథిసత్కారము.

ఆర్యావర్తమున భూసతీతిలకాయమానంబై యవంతి పురంబు రాజిల్లు. ఆపురీమతల్లి వేదశాస్త్రసంపన్నులై సదాచారపరాయణులగు బ్రాహ్మణులతోడను, రాజనీతి ధురంధరులయి పోరులఁ గుమారజయంతులనేని సరకుఁగొనని రాకొమరులతోడను, శివకేశవబ్రాహ్మణభక్తిపరులై యలకేశ్వరునకేనిఁ బరాభవంబుఁ దిరంబుగఁ జేయఁగల వణిగ్వరులతోడను, కులాచారపరినిష్ఠితులయి గోబ్రాహ్మణుల నారాధించుచు సర్వసస్యసమృద్ధిగల సచ్ఛూద్రులతోడను నితరవివిధపరికరప్రకరముతోడను డంబు వహించియుండు.

అప్పురంబునఁ గులక్రమాగతసకలవిద్యాప్రవీణత గలిగి స్వభావశఠుం డగు గార్గ్యుం డను విప్రుండు కలండు. అతండు రూపవతియు విద్యావతియు గుణవతియు నగు సుమతి యను కన్యకం బెండ్లాడెను. ఆద్విజుఁడు దుస్సాంగత్యమున వేదశాస్త్రములతోపాటు కులధర్మంబులంగూడ గోల్పోయి దారులకొట్టుటయందును బందిపోటులయందును నొకఁ డననేల, సర్వదుష్కార్యప్రణాళికయందును గార్యదక్షిత్వమూని గోప్యవర్తనంబున మెలంగుచుండెను. వెండియు నతండు వాణిజ్యకుశలతం గాంచి కోస్తావ్యాపారంబున కడుదక్షుండై యిచ్చిపుచ్చుకొను నేర్పున తనకుఁ దాన సమానుండై కపట

విధానంబునఁ గొన్నికోట్లరొక్కంబుఁ జేచిక్కించుకొని పరా రగుచు ననేకపురంబుల నిట్టి ఘోరకార్యములు సల్పుచు మానాభిమానంబులం ద్యజించి రాజదండనంబున కొకింత యవకాశంబు గలిగించుచు మెలంగుచుండు.

జీవితేశుండు గుడ్డివాఁడైన కుంటివాఁడైన సన్మార్గుఁడైన దుర్మార్గుఁడైన విద్వాంసుఁడైన నవిద్వాంసుఁడైన కలవాఁడైన నిరుపేదయైన సతీమతల్లి కాతండ కా దైవంబు. ఉత్తమాంగనామణియగు నానుమతి ప్రాణనాథుండు చూచినను జూడకున్నను దిట్టినను గొట్టినను బెట్టినను బెట్టకున్నను పతియె పరదైవంబని హృదయకమలంబునం దలంచుచు నవకాశము గలిగినంత వట్టు సభక్తిఁ బ్రియునకు సకాలమున కనుకూలస్నాన మాడించి ధౌతవస్త్రములఁ గట్టనిచ్చి కుంకుమాగరు కస్తూరీ నిస్తులంబగు శ్రీగంధంబు మేన నలంది పంచభక్ష్యపరమాన్నంబులఁ గుడువఁబెట్టి సాపడుచుండఁ దాళవృంతంబుఁగొని మెల్లన విసరుచు భోజనానంతరము వీడియమొసఁగి పాదసేవ సేయుచు నిదురించిన పిమ్మట భర్తృపాత్రంబున భుజించి యిల్లు దిద్దుకొనుటయం దొద్దిక కలదియయి తద్గ రాణించు చుండు.

ఆ సీమంతినీతిలక మొక్కనాఁడు తన నెమ్మనంబున భర్తృకృతకూరకార్యపరంపరాచింఛోళి తలంపునకు రాఁ 'బరమేష్ఠి మన్మాథున కనేతాదృశంబగు శౌర్యం బేల పుట్టింపవలె? లోకమున మానవుండు సౌజన్యమునఁగాదె యెల్లర మేటియని ప్రసిద్ధి వడయుట. దాక్షిణ్య మన్ని యెడల

గర్హ్యమెకదా! అఖిలసర్జనకలాప్రవీణుండగు వాణీప్రాణ
నాథుండు కొందఱ మతిమన్మూర్ధన్యులుగను మఱికొందఱఁ
దద్వ్యతిరిక్తులుగను నేల సృష్టింపవలె? అయ్యో! ఏమి నా
యీవెఱ్ఱి. పరమేష్ఠినినోటయనరాని మాట లనుచుంటి. బంధు
గురుజనంబులయెడ భేదబుద్ధినొంది దరిద్రుఁడయి, యింద్రి
యనిగ్రహుండు గాఁజాలక మృణ్మయంబయిన భిన్నఘటంబున
జలంబులు జాలుగొను తెఱంగున దినదినంబునకు నాయువు
క్షయంబై మృత్యువుసన్నిహితంబై వచ్చినతఱి జచ్చుటయు
మఱలఁబుట్టుటయుం గలుగుచుండ నే నజ్ఞాననై మద్భర్త కా
నలినోద్భవుండు దౌర్జన్య మేల యొసఁగవలె నని దుఃఖింపనేల?
"కర్మ క స్స్వకృత మత్ర నభుంక్తే" యనునట్లు బ్రతిజీవియుఁ
దన చేయుకర్మ మనుభవింపవలయు నని రాద్ధాంతము గలదు
గదా? "చేసికొన్నవారికి చేసికొన్నంత మహాదేవ" యన్నట్లు
నాచేసికొన్నదుష్కృతము న న్నీవిధి కలఁతవెట్ట నజ్ఞానమున
భాషానాథుఁ దూలనాడనేల? ఏమహాత్ముఁడు సకలకార్యో
త్పానాదిశక్తియుక్తుండై పావకుఁడు దారువులందు నంతర్హిత
ప్రకాశుండై యున్నచందంబున సతతము వర్తించుచుండు
నో యట్టి సర్వరక్షకుఁ డనుగ్రహించిన నాభర్త సద్గుణమణి
ఖని కాకుండునా? ఈవిపత్తునుండి పదరజోలవంబున ఱాఁతినాఁతి
జేసి సీతను వరించి రావణుసపుత్రకముగ సంహరించి యెల్ల
లోకములకు మేలొసంగిన శ్రీరాముఁడె మన్నాథుదుర్గుణ
ముల నణఁచి న న్నుద్ధరించుఁగాత!' యని గట్టిగఁ దలఁచి పత్యు

పాసనమే తన కిహపరసాధన మ్మని నమ్మి కాలము గడఁపు చుండెను.

ఏ తేజస్సంపన్నుఁడు భూమియందును నంబరమునం దును నగ్నియందును నీటియందును వాయువునందును నిండి సర్వవ్యాపకుఁడై యాదిమధ్యాంతరహితుఁడై జగత్కార ణుఁడై వెలయుచున్నాఁడో యట్టికరుణారసార్ద్రచిత్తుఁడును నామరూపశూన్యుఁడును బద్మపత్త్రాయతేక్షణవిరాజితుం డును గోవర్ధనధరుండును సర్వశక్తియుతుండునునగు నాదివిష్ణువు పతివ్రతాశిరోమణియు వినయవతియు వివేకవతియు విని ర్మలచరిత్రయు గృహకృత్యనిర్వాహణదక్షయు సదాచార సంపన్నయు ఋజుమార్గావలంబినియు మృదుశీలయు వేద వేదాంగములఁ జక్కఁగా నెఱింగిన ధర్మతత్పరయు నగు సుమ తికి సేమంబు సేకూర్ప సమకట్టి.

సీ॥ నిడుదకెంజెడగుంపు నీరెండలను గాయఁ
దెలిబూది దెసలకుఁ దెలుపులొసఁగఁ
గటినున్న చిఱుతచెంగావిపుట్టము కావి
పిల్లమబ్బుసొబగు పెంపుఁజేయ
వెన్నునఁ దగిలించి యున్నకృష్ణాజిన
ముప్పరఁబు చెలువుఁ గుప్పుచుండ
దండంబు నవకరకాండఁబు నవకరిం
పఁగఁ గమండలువుచేఁ బరఁగుచుండఁ
దన్మనోముఖనేత్రపద్మములు సెలఁగ
గాఢమోహాంధకారంబు గడఁకుఁ దొలఁగఁ

బాలపంకజబంధువుపగిఁది నటకు
వచ్చె నొకజడదారి తేఁ డచ్చెరువుగ.

గార్గ్యుఁ డింటలేనితఱి ప్రవేశింప నాపతివ్రతాతిలక మాలక్ష్మీప్రతిమ కపటవేషంబుఁ జూచి కేవలవిష్ణుఁడుగాఁ దలఁచి నమస్కరింప నాలోకలోచనుఁడు నాశీర్వదింపుడు నయ్యోషామణి యాపురుషోత్తము నుత్తమపీఠమునఁ గూర్చుండఁబెట్టి తాళవృంతానిలంబున సేదదీర్చి, 'తపోధనా! తమ వదనంబు వీక్షింప గడుదవ్వునుండి యేతెంచిన ట్లగపడుచున్నది. శీఘ్రమ యోగిరము నేసి పెట్టెద నీశయ్యఁబరుండుఁ" డని వేఁడెను. 'తరుణీ! భూమండలంబునంగల దేశముల న్నిఁటి ననవరతము గ్రుమ్మరుచుందు. నేఁటియుదయమున మేల్కాంచి కడుదవ్వు నడఁచి నీగృహము సేరినాఁడ. నీగేహముఁ దిలకింపఁ "బెన్నిధిఁగన్న పేద" వోలె నామానసమున సంతోష ముదయించెడు. క్షుద్బాధాపీడితుఁడనై యసువులు విడువ సంసిద్ధముగ నున్నాఁడను. తల్లీ! కరుణించి యన్నము వెట్టి నన్నంపిన నిన్నెంతయుఁ బలుదేశములఁ జెప్పెద. అంతియకా దబలా! ఎల్లదానంబుల నన్నదానం బసమానంబనియు నద్దానిచే సిద్ధించుపుణ్యం బగణ్యంబనియు నెఱుఁగుము. నీవు నిరంతరాన్నదానశీలవు. నేనా యతిచండుఁడను. ఇఁక సందియమేల? ఇంతకన్న ఘనకార్య ముండునే? నాయాఁకలిఁ దీర్పు' మనెను.

'యోగిశ్రేష్ఠా! తమరు వచించినదెల్ల నిక్కువము.

ఏ నన్నదానమహిమ నెఱుఁగనిదానఁ గాను' త్వరలో వంట
చేసి తెచ్చెద, క్షమియింపుఁడు.'

'ఓలలనా! నీ వెప్పుడో చేసిపెట్టెదనని న ప్రాణములు
నిలువవు. చలిదియన్నమునయిన నొకింత బెట్టుము.'

'ఆర్యా! సమస్తశాస్త్రపారంగతు లగు తమ రట్లనఁ
దగునే? నిష్ఠాగరిష్ఠులును యజనయాజనాధ్యయనాధ్యా
పనదానప్రతిగ్రహంబు లొనర్చు మిముబోంట్లు చలిదిని
గుడుచుట కియ్యకొందురే?'

'ఓ యంగనా! ఎట్టి నిష్ఠలయినను బ్రాణము లున్న నే
సుమీ! ఆలసింపక వడ్డింపుము. ని న్నే దోసము నంటదు.
మేన నసువు లున్నగదా భాండశుద్ధియు గృహశుద్ధియుఁ జిత్త
శుద్ధియు విచారించుటలు? "క్షుధాతురుణాం నరుచి ర్న కాల"
యని మాన్యు లందురుగాదె?'

పాప మా మృగేక్షణ కే తెఱవును గానరాదయ్యె.
వృద్ధుఁడును నిర్మలచిత్తుఁడును యోగ్యుఁడు నగు నాయతీశ్వరు
నకు జలిది నిడుట కాయమకర మాడకున్నది. వంటకంబు
సేయువఱకా యాతఁ డోపికవట్టున ట్లగపడుటలేదు. మిన్న
కుండిన దో పరమసాధు వలుగును. ఆతఁడు క న్నెఱ్ఱఁజేసెనా
మేరువు చలించును; దిగ్గజములు మ్రొగ్గును; చుక్కలు
రాలును. "గుడులుమ్రింగువానికిఁ దలుపు లేపాటి" వన్నట్లు
ప్రపంచమును తాండవమాడించుదివ్యప్రభావున కొక స్త్రీ
లెక్కయా?

సుగుణమణియగు సుమతి తనమనమున 'నాహా! విచారించి చూడ నీతఁ డెవ్వఁడో దివ్యపురుషుఁడుగాని వేఱొండు గాదు. నను పరీక్షింప నేతెంచిన మందస్మితవద నారవిందుం డగు నారాయణుఁడో ముజ్జగములఁ బోషింపఁ గాలకూటవిషముఁ దాఁగిన విరూపాక్షుఁడో నై యుండ నోపు. కానన్నది కాకమానదు. "ఓటిలో తలఁదూర్చి రోకటిపోటునకు వెఱువదీఱునా?" యని తలఁచి లోనికి వెడలి భాండంబునందలి చలిఁదియన్నంబునంతయు నొక యరటియాకున బెట్టి పెరుగుబోసి దీనిందిని యాఁకలివాపు కొం' డని సలిలముల పాత్రి నుంచి గృహముసొచ్చెను.

ఆ లలనామణి లోనుండి బయటి కేతెంచుసరికి నతఁ డెల్లపదార్థముం దిని, 'బింబాననా! నీ విడినపదార్థ మావంత యయిన నాకుత్తు నాపలేదు. కనికర ముంచి యొకింతఁ బెట్టు' మనవు డాకె యచ్చెరువందుచు భాండంబున బువ్వలేమిం దెల తెల పోవుచుండ నాపద్మాక్షుఁడు 'తోయజాక్షీ! ఆలసించెద వేల? వెదకి కొన్ని మెతుకులనయిన మజ్జిగలో గలిపిపోయు' మన నాసుందరవదనయు నట్లొనర్చెను.

మాయవేసకాఁ డతిత్వరితముగ నెల్లయుఁ గుడిచి, 'పూఁబోఁడీ! ఇంక నేమైన నిడి నాయాఁకలిఁ బోఁగొట్టు' మని వచింపుడు నాయమ కడుంగడు నాశ్చర్యమగ్నమానసు రాలరు చేయునదిలేక కాఁగుచున్న పాలదుత్త నివ్వ నెల్ల క్షీరంబుల నొక్కగుక్కటిలోఁ దాఁగి యాఁకలితీఱలే దేమైనఁ దేమ్మని గజిబిజి చేయుచుండ నప్పటికి తయారైన శాల్యో

దనంబును హైయ్యంగవీనంబును మధురసూపంబును రుచ్యము
లగు శాకంబులును కమ్మని పిండివంటలును నన్నింటి నింట
లేకుండ వడ్డింప సంయమివరుఁ డన్నింటిఁ దినివైచెను.

విప్రనారీరత్నముచే నివ్వఁబడు పదార్థముల నామా
యకాఁడు భక్షించి మఱి యెదురు చూచుచుండ నావిప్రపత్ని
కేమార్గముదోఁపక 'నబ్బా! యిదెట్టివిపరీతము? వార్ధక్యమున
నుండి యొడలు కదల్పఁజాలని యితని కీయాఁక లెట్లబ్బె? ఈతని
నింతఁదనుక నరుఁడని తలఁచితికాని నరుఁడు కాఁడు కాఁడు. నర
రూపముననే తెంచిన త్రిభువనాధ్యక్షుఁడగు సహస్రాక్షుఁడో కాం
చనమణిపుంజగుంజద్భూషణభూషితుం డగు పుండరీకాక్షుఁడో
యత్యంతకృపాళుత్వంబున ముజ్జగములఁ బ్రోఁచిన విరూ
పాక్షుఁడో' యని తలఁచుచుఁ గనుఁదెప్పవాల్చునంతలో సతత
దయాస్వాంతుండును సకలసద్గుణవంతుండును పతితపావ
నుండును నగు శ్రీమన్నారాయణుండు దత్కాంతారత్నము
బత్తి కత్యంతసంతోషాక్రాంతుండై శతకోటిసూర్యదివ్య
తేజోవిభాసితంబగు తనదివ్యవిగ్రహంబు సూప నాపతివ్రతా
శిరోమణి యంజలి ఘటియించి 'యోరమాపతీ! ఏ పదార్థము
ప్రమాణమూలంబునం దోఁచు నది లోకలోచనుండవైన
నీదురూపము. స్థావరజంగమాది నానాభూతసహితుండ
వగు నీదుప్రభావంబు నెఱుంగక సంసారపరవశులయిన
జీవుల మాయాంధకారంబు నివర్తింపఁజేయ సమర్థంబగు
నీదివ్యలీలావతారంబులంగలుగు కీర్తి యను దీపంబుఁ బ్రజ్వలిం

పంజేసి కృపసేయునట్టి నీకిదె నమస్కరించెద' నని ప్రార్థింప
నాభక్తమందారుఁ డా యువతీతిలకముతో, 'సతీమణీ! నీదు
పరమపాతివ్రత్యమ్మునకును నిరంతరాన్నదానశీలంబునకును
హెచ్చుగ మెచ్చితి. మదీయసత్సందర్శనంబున మహైశ్వ
ర్యంబులు వొడము. దుర్మార్గుఁడగు నీదు పెనిమిటి నేఁటినుండి
సజ్జనాగ్రగణ్యుఁ డని పేరు నొందు. అనంతసుఖముల ననుభవిం
చుచు సకలభూతంబులయందును ధర్మముంగలిగి స్నాన
జపాద్యనుష్ఠానంబుల నేమఱక సేయుచు నిస్సాక్షిభుక్తం బ
యుక్తం బని యెఱిఁగి యతిథులఁ బూజింపుచుఁ గామక్రోధ
లోభమోహమదమాత్సర్యంబుల నణఁచి నిరంతరము
మత్పాదధ్యానమనస్కులరయి నూఱువత్సరంబు లిట్లు సుఖం
బునఁ గాలము గడఁపి యనంతరంబు మద్వైకుంఠపట్టణాభ్యం
తరమందిరంబునకు రం' డని వచించి యదృశ్యుఁ డయ్యెను.

గార్గ్యుఁడు, మందరధరుండు మగువతో ముచ్చటించి
వెడలిన మఱువాఁ డిలు సేరెను. ఆపద్మాక్షి పలువితములఁ
బ్రియునకు సపర్యల నొనర్చి పరమానందమునఁ దాఁ గన్న
పురాణపురుషుమహత్త్వంగూర్చి చెప్పెను. భార్యచేఁ జెప్పఁ
బడుమాటలు విన్ననాఁటఁగోలె వనరుహాక్షుల యిండ్లలోఁ
గాలము గడఁపు తులువ యత్యంతవైరాగ్యనిష్ఠుఁడుగను,
లెక్కకు మీఱిన డబ్బులచే ద్రవ్యమార్జించి పిల్లికేని బిచ్చ
మీయని లోభి యుపకర్తుఁడుగను, వర్ణాశ్రమధర్మములు
వమ్ముసేసి మార్గస్థుల హింసించిన పాపి ధర్మరతుఁడుగను
సత్యసంధుఁడుగను నిష్ఠాగరిష్ఠుఁడుగను మాఱిపోయి తన సతి

తోడ నమితానురాగమునఁ బొద్దులు పుచ్చుచు సంతత శ్రీమన్నారాయణపాదారవిందసేవామృతాస్వాదన తత్పరుఁడయి పెక్కుతీర్థములం గ్రుంకులిడి పవిత్రస్థలముల దర్శించి పుడమిం బెద్దకాలంబు సుఖంబునఁ గాలము గడపి పదంపడి భార్యాసమేతుఁడయి శేషశయనుని వాసస్థానమగు వైకుంఠముం జొచ్చెను.

ఓ పాఠకమిత్రమా! సుమతి తనసద్గుణములచే గదా యేరికిఁ దరముగాని శ్రీమన్మహావిష్ణువును దర్శించుటయుఁ బతిని యోగ్యునిగఁ జేసికొంటయు నుత్తమగతి కేఁగుటయుఁ దటస్థించినది! పాతివ్రత్యమహిమ వర్ణనాతీతము సుమీ!



# VI

## వంజరావతరణము

పూర్వ మొకప్పుడు గౌతమీసింధుసమీపంబున గోప
కుమారులాలమందలు గాయుచుండ నొక్కనాఁడు నీటివడిం
బడి గర్భిణికర్కటి యొక్కటి వచ్చి బొరియ గావించుకొని
వసించుచుండ నొక్కతుంటరిబాలకుం డుక్కుమిగుల పాల
దుత్తనొక్కం డద్దానిపయి వైవ నాకర్కటి యుదరగోళ
మదిరి పగులుడు లెక్కకుమీఱిన పెక్కుపిల్ల లుర్వింబడి దుగ్ధ
స్నిగ్ధమృత్తికం దిని పెరుఁగుచుండెను. కర్కటియు భగదను
గ్రహమువలన బ్రదికి జీవించి సుఖం బుండె.

అట్లు పెరుఁగుచుండ నం దొకయర్భకము తన జననిం
జేరి 'తల్లీ! పుట్టిననాఁటఁగోలె రుచికరంబుగనుండిన మన్నేలొకో
నేఁడు నోటికసహ్యము గలుఁగుచున్న' దనవుడు నాయండ్రి,
'యన్నా! నీ వింతదనుక భక్షించినమృత్తు మున్ను పయః
పూరంబువలన నత్యంతాభిరుచిపూరితం బయ్యె. అయ్యది
ని న్నింతదనుకఁ బోషించె. కేవల మృద్భక్షణం బెఱుంగని
దాన వగుటం జేసి నీ కిప్పు డయ్యది యరుచికరంబుగ నుండె' నన
నాశాబకము 'జననీ! పా లనునవి వేఱని వచించెదు. 'పాలు ద్రా
వనివాఁడు పరమశుంఠ' పాలే పరమజీవనోపాధిఁ గలుగఁ జేయుఁ
గదా! పాలు మన కెట్లు సిద్ధించు నానతి' మ్మన్న, 'వత్సా!
పరమేశ్వరుఁడు దేవతల కమృతంబునుంబలె నరులకు బాలను
జీవనోపాధిగఁ బ్రసాదించినాఁడు, బిడ్డా! లోకములు త్రివిధ

ములు నాఁ బరఁగు; నయ్యవి స్వర్గమర్త్యపాతాళములందు నాకలోకమున దివ్యదేహులు ననిమిషలోచనులు నమృత భుక్కులు వైమానికాగ్రహులు నగు దేవత లుందురు; వారి కాఁకలియు నీరుపట్టును శీతోష్ణభయంబులును జరారోగ వికృతులును బుట్టవు; మధ్యమలోకమున వినశ్వరదేహులును బద్ధనేత్రులును నన్నభోక్తలును నశ్వాదివాహనారూఢులు నగుచు మర్త్యు లనువా రుందురు. భూలోకమున సుకృత మొనర్చిననే మోక్షమును బొంద సర్వులు. ఇందలివారు తమ తమ కులాచారధర్మముల వీడక సత్యవ్రతులు గురుజన హితులు ధర్మరతులు నహింసాతత్పరులు నయి సర్వపాపోప శమన యగు భాగీరథి నవగాహులయి సనాతనులగు నుమా మహేశ్వరులఁ గాంచిన వో ముక్తిఁ జెందఁగల్గుదురు; తృతీయ భువనమందు నాగములుఁ వసించు. ఈ యర్థమును తొల్లి గంగాజలముల తాననమాఁడు పండితోత్తములు ముచ్చటించు చుండ నే వింటి' నని చెప్పను.

తల్లి చెప్పిన గంగామాహాత్మ్యమునకు పిల్ల యుల్లం బున పెల్లుమోదంబు రంజిల్ల మెల్లన నాలకించి మొట్టలయిన నా భాగీరథిం గన్నులారఁజూచి పులకమాపరించి తన జన నికి మనోరథంబు బయలువెట్ట నయ్యది పుత్రుం జూచి 'యన్నా! కన్నుదెఱువని పసిపాపఁడ వీ వేడ, మునిస్తోత్ర పాత్రమగు నమరాపగ యేడ? ఎన్ని పొద లెన్ని గుట్ట లెన్ని యడవు లెన్ని సాంద్రారణ్యములు దాఁటిన గంగ కేగుట? మార్గమధ్యమున నెన్ని దుష్టమృగములఁ బరిమార్చిన భాగీ

విధం గనుట? భాగీరథికన్న తొలుదొల్త మన భరతఖండం బున బుట్టినది గౌతమి. సతత మెందరెందరో వచ్చి స్నాన మాడు చుండెదరు. నీ కిష్టమయ్యేనేని గౌతమిలో గ్రుంకి మమ్మెల్లరఁ దరింపఁ జేయుమ' డని బోధించెను.

చతుర్ముఖప్రముఖసర్వగీర్వాణులును దివస్పతిప్రభృతి దిక్పతులును సనకసనందనాది యోగీశ్వరులును నెద్దాని పవిత్రవారికణసేచనమున కృతార్థులు కాదలంతురో యట్టి భాగీరథీస్నాన మహాఫలం బర్థించు నీమాణవకంబునకు గౌతమియందు జలకమాడ నెట్లిచ్ఛ పొడము? పాపము! తల్లి యొద్ద ననుజ్ఞఁగొని గంగకు వెళ్ల నెంచెడుదాని నొక్కవిహంగ మము అవ్వనపయిఁబడి గోళ్లనిఱికించుకొని వెళ్లి భూరుహ శాఖపయింబెట్టి చంపి భక్షించెను.

గంగానదీస్నాన మభ్యర్థించు నర్భకము పక్షిచేఁ బొలి యింపఁబడి నేపాళదేశమున కధీశ్వరుండగు కనకమండనుని యాలమందలో నొకసురభికి చక్కనిలేఁగయయి యావిర్భ వించెను. గోపాలకులవలన నాతఁడు తనయాలమందలో మంచి క్రేఁపుగల దని విని దానితల్లికి బాలు పితుకకుండ సేవ కుల నాజ్ఞాపించి యది మాతృక్షీరబలంబున వృద్ధినొంద నాబోతుగఁజేసి గారవించుచుండెను. భూకాంతుచేఁ బెంపఁ బడుచున్న యావృషభేశ్వరుండు కాల్ద్రివ్విన వసుధరాదేవి వ్రియ్యలగుడు భూభారధురంధరుఁడగు నాదిశేషుఁ డెచ్చోటుఁ గానక భూతలంబున కరుదెంచుభాతిగను, నాసురభిసుతుఁడు ఱంకెవైచిన సప్తపర్వతగహ్వరనివాసములగు పంచాననము

లదిరిపడి దిక్కుగానక తత్తరపడురీతిగను, నావృషభరాజుకొమ్ము
లచేఁజిమ్మఁబడిన శిలలు బంతులవలె నంబరవీథి కేగ వాని యొర
పిడికి పట్టుకొనఁన జాలకునికి మేఘము లటునిటు బఱుఁగులిడు
పోల్కిఁగను నాగోపతి కోపోద్రేకమున ఒఱువులెత్తిన వృక్షుల
తాదులన్నియు దుత్తుమురయి నేలఁ గూలెను చండమునను
నెదురులేని బలవంతుఁడై గోపికాజనమోహితాకారవిలా
సుఁడగు నాగోపాలకృష్ణుమాడ్కి సంచారమ్మై పెక్కు సుర
భులవలన సువత్సంబులఁ బెక్కింటిం గని, వంబులపయి నిచ్ఛ
లేనివానిపగిది యుద్ధాంగణమున నొక్క కంఠీరవంబుం
గగిసి కరికరింబోరు తెఱంగున నొకరి నొకరు దొలుఁ ద్రోసి
కొనుచు మహాభయంకరయుద్ధమున సక్కసరిసమాన గూలెను.

భాగీరథిం గుఱింకనెంచిన కర్కటశౌటకము వృషభా
కారముసు వీడి కొంకణదేశమును బాలించు సితెడత్తభూపాలు
నకు వంజరుఁడను నామధేయముతోఁడ బుత్రరత్నమై పుట్టెను.
ఆబాలుఁడు యుక్తవయస్సంపన్నుఁడై సర్వకళాప్రవీణుండగు
కతన నీతివర్తనంబునం బ్రజలచే గాపింపఁబడుచుండ
సితదత్తుఁ డెంతయు బరమానందభరితుఁడగు పుత్రుసకొక
రాకుమార్తెం దెచ్చి పరిణయం బొనరింపఁబ్రయత్నించు
చటి నొక్కనాఁ డేకాంతంబున నాసుకుమారాకారుఁడు సిత
దత్తుతోఁడ దా గంగ కేగి తానమాడ నెంచుచున్న ట్లెఱిఁ
గింప నా భూకాంతుఁడు చిత్తరువువోలె విభ్రాంతుఁడై
నిలిచి కొంతతడవునకు ధైర్యమూని, 'పుత్రా! ఎన్నెన్ని
యో నోములు నోఁచి నిన్నుం గని సంతసమునఁ గాలము

గడఁపనెంచు మా కోర్కెలన్నియు వమ్ముసేసెదవా! పిల్లల పలుకులు తల్లిదండ్రుల కనుఃక్షుణంబు నుల్లాసదాయకంబులనియు సర్వశ్రమల వాపి దుఃఖములఁ బోకార్చుననియుఁ గర్ణకుండలములవలె 'ప్రకాశమానములై ప్రపంచమున నెందఱెందఱినో ముఱిపెమున ముంచుననియు వచియించెదరే? అన్నా! నవమాసములు మోసి కని పెంచి పోషించిన నీజననియు సర్వవిధముల నీవే దిక్కని యెంచి నిను జూడని నిముస మొకహాయనముగా నెంచెడు నేనును నీవు గంగ కేగిన మనియుండఁగలమా? కొంకణదేశ మెక్కడ—గంగా నది యెక్కడ? నీకీభ్రాంతియెట్లబ్బె? సమస్తైశ్వర్యభూయిష్ఠమగు రాజ్యపదవి నొంది యెల్లమహీనాథులలో నగ్రస్థానము వహింపఁదగుఁగాని యరిషడ్వర్గంబుల జయించి మానస మనెడు హరిని గట్టిపెట్టి హఠరాజయోగములచే హృత్కమలమున వెలుఁగొందు ధనంజయస్యందనభూషణంబగు తుమ్మెదను దివ్యదృక్కుల వీక్షించెడు యతిచంద్రులకుఁ దగుఁగాని తీర్థస్థలములు నీకేల?' యనవుడు, 'జనకా! విష్ణుపదపద్మములఁ బుట్టి ముల్లోకములఁ దననిర్మలోదకములచేఁ బవిత్రము సేయు గంగానదిని స్నానమాడని నరుఁడు నరుఁడా? పుణ్యస్థలముల దర్శించుటకును బవిత్రమగు జలములఁ గ్రుంకుటకును నహింసఁ జేయకుంటకును సద్విద్యలఁ బడయుటకును వయసుతోఁ బనియేల? శ్రీమన్నారాయణుండు మనుజుని హృదయము బరీక్షించుఁగాని బాహ్యశరీరచిహ్నముల నెన్నఁడు సూడఁడు. సనాతనుఁడైన రమానాథుఁడు మన

హృతీసిమ వసియించి సమస్తంబుఁ బరీక్షించు; మన మాతని జూడలేకున్నను మనల నతఁ డెల్లప్పుడు సూచుచున్నాఁడు. కనుకఁ ద్రికరణశుద్ధిగా బ్రతిజీవియు సత్కర్మము లొనర్పఁదగు. పుణ్యస్థలములు నేఁడే పుట్టెనా ?
"అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా,
పురీ ద్వారవతీచైవ, సప్తైతా మోక్షదాయకాః."
అని వచింప వినమా!' యని వచించిన బిడ్డను గంగ కేగుమనుటకును నింటికడ నుండుమనుటకును దోపక కోసలరాజ్యరమారమణుండగు పంక్తిరథునివోలె బిట్టు చింతించి సపరివారంబుగను ససర్వపదార్థంబుగను గుమారు నంపుచు డాయ బిలిచి కౌఁగిలించుకొని మూర్ధంబు మూర్కొని సత్వరగముఁడవుదువు మని దీవించి భూలోకకైలాస మనంబరఁగు కాశి కంపెను.

ముద్దులబిడ్డఁ డగు వంజరుఁ డెలువిడిచిన తర్వాత రాజు చక్కనిపాలన మెఱుఁగఁడు. మంత్రులఁ బిలువఁడు. నిజసతిఁ గారవింపఁడు. జలక మాడఁడు. ధౌతవస్త్రముల ధరింపఁడు. అన్నము గుడువఁడు. నీరు ద్రావఁడు. హృదయము పుత్రవియోగాగ్నిచే తహతహమంటలు మండుచుండ, 'వంజరా! నే నెంత దౌర్భాగ్యుఁడను, నవయౌవనాకారు సుగుణాలవాలు ని న్నేబుద్ధితో గంగ కంపితినోగదా! అన్నా! నీ సురూపసుగుణశోభావిశేషములఁ గన్నులకుఁ దనివితీఱఁ జూచుకొనెడి నోము నే నోఁచనైతి. పుత్రా! వన్యఫలాహారములును విటపకుటీరావాసములునా యగ్రాము

లు నీకు! దివ్యహర్మ్యములయందు రాజ్యవైభవసమగ్రి సౌఖ్యముల ననుభవించెడు నీ వా ఘోరారణ్యముల నెల్లబోవుచుంటివో గదా?' యని మనమున పెక్కురీతులఁ బుత్రుఁ దలపోయుచు నేఁడవనాఁటిరాత్రి పుత్రా! యని కేక నొక్కటవిడిచి ప్రాణములఁ గోల్పోయెను.

సింహదత్తుఁ డసువుల వీడినతర్వాత మంత్రిసామంతపురోహితభృత్యులెల్లలు నొకచోఁ గుమిగూడి దేశక్షోభ మరాజకమూలం బగునని తలపోసి వంజరు దోడ్కొని రా మనోనిశ్చయులయి కతిపయప్రయాణంబులు సేసి సేసి యొక్కగ్రామమున విడిసియున్న వంజరుఁ గని నమస్కరించి, 'స్వామీ! మీ మోము సూడనికతన బ్రాణములు నిలువవని మీనామము నుచ్చరింపుచు మీజనకుఁడు తమ రిలువిడచిన యేఁడవ నాఁ డస్థిపంజరమును వీడె. ప్రభునందనా! రాజ్యమున నా ప్రజలలో నంతఃకలహములు పుట్టు. శత్రురాజు లొక్కుమ్మడి దాఁడివెడలుచుందురు. రాజ్యలలామ తగిన నాథుఁడు లేఁ డని చిట్టానగము. ప్రజలు తండ్రిలేఁడని సంతాపింతురు. రాకుమారా! మా విన్నప మాలించి యింతమందిని గాపాడఁదగు. గంగాతోయముల స్నానమాడు టెట్టిదో యింత మందిని సంరక్షించుటయు నట్టిదే. సజ్జనులయందుగదా సత్యనారాయణుం డుంట! పృథివీచక్రమును బాలించుచు సర్వ జనుల నాదరించినవాఁడే నారాయణప్రియుఁ డగు. అందులకే "నావిష్ణుః పృథివీపతి" యందురుగదా! కనికరమూని ధరామండలాధిపతి వగు'మని ప్రార్థింప నాసజ్జనాగ్రగణ్యుఁడు పితృమర

నాముప్పక బిట్టు చింతించి, 'మంత్రిపురోహితోత్తములారా!
అస్మత్పిత యెట్లు మడిసె? ఇంక నే నెట్లు గృహమున కేతెంతు?
నే నీగంగలో బడియెద' నని 'నాథా! సమస్తంబుఁ దెలిసిన
తమరు ట్లాడఁదగునా? ఎవరెట్లు గర్వనప్రాయ మని చెప్పి
యరా? నేఁడు షోడశమహూర్తా లుండిరా? అట్టులె భవ
కంఘరు. ప్రతిజీవియు నెట్లైతేని యట్లు వెడలుటయు
ధర్మమేకదా? స్వామీ! మనము సేసినకర్మ మనుభ
వింపక తీఱునా? దేవరజనకుఁడు మడియుట కొక విచిత్ర
హేతువు కలదు. ఏలినవారి కవకాశ మిచ్చిన మనవి సేయు
దము. వింధ్యపర్వతప్రాంతారణ్యముల సుశీలుఁ డను బ్రాహ్మ
ణుఁడు గ్రీష్మకాలమధ్యాహ్నమార్తాండుం బలెఁ బ్రకా
శిల్లుచు శుక్లయజ్ఞోపవీతంబు ధరియించి నారచీరలు గట్టి
త్రిపుండ్రంబు నొసట దాల్చి వేదవేదాంగపారంగతుఁడై
తపమాచరింపుచుండ నాపలాశ యనవతి యను నొకయువతి
పోడశవర్ష నాభూసురుఁ డాయువతి నాపలాశణ్యపుల
కన్నుఁ బొందుచు నామె మోహంబు చెట్టుబట్టుఁ బోవ నా
పడఁతి గర్వాంధకారమున బ్రాహ్మణోత్తముని దూలనాడి
మన్మథలీలల బిట్టు చపలఁ జేయ నామెఁ డాచెం వెతను చేసి
కుకర్యయగునట్లు శపియింప నాపని యతని పదపద్మముల
గరంబు ప్రణమిల్లి శాపవిమోచన మానతీయరే యని ప్రార్థింప
నప్పుడుఁ 'ఢోనారీ! నీవు తేఁటికుక్కవై పుట్టి యొక్క
శిశువుం గాంచి కాపాడుచుండు తఱిఁ జేఁ డొక్కండు నీబిడ్డ

కపకృతిసేసి నీచే శాపమునొంది వెడలుచుడు నీవు బిడ్డకై
యేడ్చి మరణించి చెంచెతఁపు దాల్చెదు పొమ్మనెను.

బ్రాహ్మణశాపంబున నాచెంచెత తేఁచుకుక్కయయి
సనువు గని పెంచుచుండ మాతండ్రి సితదత్తభూకాంతుఁ
డొక్కనాఁడు తావునకు వేఁటకేగ నా తేఁచుకుక్క మాజ
నకు గఱచుటకు రా నతఁడు పెంటుశరమును సంధించి నిజసుత
ప్రాణసంరక్షణార్థమై శునక మ్మొల్లు తనపయిఁబడిన దని యూ
హించి యూపనికూసన జంపెను. అంత శునకము యకారణ
ముగఁ దనబిడ్డను ఒరివార్చెను మాజనకుఁ దొల్లి దశరథుఁడు
సరయూనదీప్రాంతమున మాటుబెట్టుకొని యుండి మునికు
మారుఁడు వృద్ధులగు తన జననీజనకుల తృషఁదీర్ప సొఱకాయ
బుఱ్ఱ నానదిలో ముంచుచుండ దానిశబ్దము సేనఁగునీరుద్రా
గుటఁగా భావించి యంబునేయ నా మునికుమారుఁడు నారా
యణా! యంచుఁ గెకలిడి నేలఁబడినఁడు తత్తఱపడుచు బాలు
కడకేగి వాని వృత్తాంతంబు సర్వంబు నెఱింగి జరిగినదెల్లయు
వృద్ధులగు నాబాలుతలిదండ్రులకు దెలుప వారలు చింతించి
ఒడి పుత్రునకై యేడ్చుచు దశరథుండును దనపెద్దకుమారుఁ
డగు శ్రీరామచంద్రుఁడు తన్ను వీడి ఘోరారణ్యములకేగెడు
తఱి నిజపుత్రునికై తపియించుఁగాత! యని శాపంబిచ్చిన దం
పతులు బుత్రశోకంబు భరియింపఁజాలక ప్రాణములఁగోల్పో
వుచు ‘రాజా! నీవు నిసికూన నకారణముగఁ జంపి తీఱని
దుఃఖంబుఁ బ్రసాదించితివి కాన నీవును నీతనయుఁ డగు వంజ
రుఁ డీలు వీడునపుడు పుత్రా! యని తలపోయుచు ప్రాణముల

విడిచెదవుగాక!' యని శాంపబిచ్చి విప్రవాక్యానుసారముగఁ దనఃహాపుఁ దా నొందెను. మీాశంఢిప్రియు నిలుసేరి సంతానంబు లేమింజేసి కరంబు చింతించి పరమేశ్వరుగూర్చి దొడ్డతపం బొనర్చ దేవరవా ంస్ఖవించితిని. మహాప్రభూ! కరుణారసార్ద్రహృదయులరయి రాజ్యమున కేతెంచి మముఁ బాలింపుఁ' డని వేఁడ వంజరశ్రేష్ఠుండు కాశీవైపు దృక్కులు నిగిడ్చి 'యచిరకాలములో నేతెంతు' నని ప్రార్థించి ససైన్యముగ నిజపురంబు సేరి సితవస్త్రమహీశ్వరునకుఁ బితృకృత్యములు యథోచితముగ నొనర్చెను.

ఒక్కనాఁడు నగరతోరణ స్తంభములయందలి జయపతాకము లెగురుచు జయభేరీనినాదము మేఘగర్జనముల ననుకరించుచుండ బురుషశ్రేష్ఠుండగు వంజరుండును దేవేరియగు ధామినియు సింహాసనాసీనులగుచుఁ నభిషిక్తులగు భాగీరథీతరంగిణీజలశీకరము లెల్లరఁ దమతమపనుల మఱపింపఁ జేయుచుండెను. అంతఁ బురోహితుఁ డభినందించి సవధాన్యంబుల దూర్వాంకురంబుల నొసఁగి యమూల్యమణిమయకిరీటాలంకృతమగు నా నృపాలుమస్తకంబున తనహస్తమిడి.

"సీ॥ బ్రహ్మాయు·రస్తు విప్రప్రసాదోస్తు క
ల్యాణపరంపరావాప్తి రస్తు
దేవేంద్రభోగోస్తు దిగ్విజయోస్తు సు
స్థిరకీర్తిరస్తు వాక్సిద్ధిరస్తు

సౌభాగ్యమస్తు శాశ్వతసమున్నతిరస్తు
సంగరవిజయోస్తు సౌఖ్యమస్తు
వస్తువాహనసంపదస్తు చింతితమనో
రథసిద్ధిరస్తు సామ్రాజ్యమస్తు
సప్తసాగరపరివృతసకలభూమి
మండలైకాధిపత్యసమాగమోస్తు
పుత్రపౌత్రాభివృద్ధివిస్ఫూర్తిరస్తు
మంగళాని భవంతు తే మనుజనాథ!"

యని దీవింప నెల్లరు సంతోషాంబుధిలో మునింగి తేలుచు పెక్కురీతుల సకలసద్గుణగరిష్ఠుఁడును నసామాన్యప్రతిభాశాలియు నగు వారాజచూడామణిగుణగణములఁ గొనియాడిరి.

వంజరనృపాలుఁడు రూపయౌవనసంపన్నయగు భామినివలన నుదగ్రప్రతాపుఁడగు నుగ్రలోచనుం డను పుత్రరత్నముంగని రమణీయమగు రాజధానీనగరము విలాసవిభ్రమలీలారంగములగు ప్రమదోద్యానవనములు సకలసంపత్సమృద్ధంబగు రాజ్యమును నస్థిరము లని పరిగణించెను. వెండియు నతండు తనహృదయమున సంసారానిత్యత్వమును దృశ్యజగత్పదార్థముల యశాశ్వతత్వమును జక్కఁగఁ దలపోసి యొక్క శుభముహూర్తమున తనపుత్రునకు బుణ్యనదీజలాభిషేచన పురస్సరంబుగాఁ బట్టముగట్టి 'నీతికుశలత్వంబుఁ దీపింప రాజకులోచితసద్గుణుండవయి రాజ్యపాలన మొనర్చున' దని దీవించి తపమాచరింప నడవి కేగ నుగ్రలోచనుఁడు రఘుమహారాజువోలెఁ జక్కఁగఁ బాలింపుచుండెను.

* * * *

"స పితా పితర స్తాసాం కేవలం జన్మహేతవః."

వంజరుఁ డయ్యరణ్యమున వేసవికాలమున మట్ట మధ్యాహ్న వేళలందు సహస్రకిరణున కభిముఖముగా బాదములుగాలెడు దాలపయి నిలిచియువర్షాకాలములో పుక్కిటిబంటువఱకు నీళ్లలో నిలిచియుఁ జలికాలమున వేకువజామున మేల్కాంచియుఁ బెక్కుతెఱఁగుల శరీరసౌకుమార్యముల నన్నింటి మఱచి యీశానుగూర్చి ఘోరతపం బొనర్చుడు శచీపతి గడుంగడు వెఱఁగంది యలోకసామాన్యరూపలావణ్యవిలాసవతులగు నప్సరసల నారాజఋషి తపంబు సెఱుప నంప వార లెన్నిప్రయత్నము లొనర్చినను నయ్యవి "మహౌషధంబు నెదుర్కొను రోగము"లట్లు వృథయయ్యెను. ఆముచ్చెకంటులు చేయునదిలేక సిగ్గుఁ దెచ్చుకొని పాకారికడ కేగి తమపడినపాట్లును సాపురుషపుంగవు తపోనిష్ఠాగరిష్ఠత్వంబును వేయివిధములఁ జెప్పి యాతని తపంబుమాన్ప దేవఋషినాఁబరఁగు నారదుండు వలంతి యని వాక్రువ్వ బలసూదనుండు బ్రహ్మపుత్రుం బ్రార్థింప నతం డింద్రునియర్థ మెఱింగి జలజాసను దోడ్కొని వెడలి తన దివ్యదృష్టిచే వంజరుఁ డీశ్వరుఁ గూర్చి తపమాచరించుట గ్రహించి యాచేరువున నీశ్వరజటావిభూషణంబగు దివ్యతటిని దెప్పించి వంజరునకుఁ గీర్తిసుకృతంబులు గట్టిపెట్ట నెంచి పద్మాసను గొంకణదేశాధీశు నాకృతిగైకొని యంతరిక్షమున నదృశ్యరూపంబున నుండునట్లు సేసి తా నాహ్వానించినపు డెదుట

నిలిచి యిట్టిట్టు బలుకు మని చెప్పి జితేంద్రియుం డగు నారదుండు నీలమేఘశ్యాము స్తోత్రమొనర్చుచు నంబరవీధినుండి డిగ్గి వంజరునెదుట నిలువ నతఁ డత్యుత్సాహంబున నా తపోధనుని పదపద్మముల కెఱఁగి 'తాపసోత్తమా! త్రిలోకసంచారులు విచ్చేయుటఁజేసి మజ్జన్మము ధన్యతనొందె. వివిధవిశేషంబు లెఱింగించినను గృతార్థుఁజేయరే?' యని ప్రార్థించిన రాజఋషి కా బ్రహ్మదేవరతనయుఁడు, 'రాజతిలకా! ఏను ముల్లోకములఁ గ్రుమ్మరుచు దక్షిణాదిశాధీశ్వరుకడ కేగితి. అక్కడ నెన్నెన్నియో వింతలు జరుగుచున్నవి. ఒకదిశ నత్తమామలను బూజింపక భర్తను ద్రొక్కిపెట్టి యన్నింట దా నాధిపత్యము గట్టుకొన్న పాపి నెఱ్ఱఁగాగాలినయినుపకంబమున కంటించి కొరడాదెబ్బలు గొట్టుచున్నారు. ఒకవైపునఁ దాఁగుడువక నితరులకుఁబెట్టక నొరులు దినుచుండ నోర్వక సర్వము నాది యని మూఁటలుగట్టి భూస్థాపన మొనర్చినరక్కసిని చలచలకాగు నువ్వులనూనెకళాయిలో వేసి యుడికించుచున్నారు. వేఱొకమూల భూతదయఁదెలియఁజాలక సర్వము నెఱుఁగుదు మని విఱ్ఱవీగుచు దురభిమానమున భగవంతునిఁ బూజింపఁ జాలకున్న ఛాందసులను దుడ్డుకఱ్ఱలతో మస్తకములు వగులునట్లు మోదుచు నారాయణమంత్రము నాణెమైనదని తెలుపుచున్నారు. ఒక్కమూల పుత్రులు తిలోదకము లిడి యస్తు లుదకమున గలుపనికతన భయంకరోరగములచే గఱపింపఁబడువారు గలరు. అందు నీ జనకుఁడగు సితదత్తుఁడు గలఁడు. పాప మా ధర్మరాజు నాయందు కృప

వహించి నీ జనకుఁ జూపి నీ చరిత్రము నంతయుఁ జెప్ప నే నచ్చెరువంది నీ తండ్రి కెట్టులయిన మోక్షముఁ బ్రసాదింప నెంచి యిటకుఁ దెచ్చితి. నీ వింకనయిన నీవెత్తితపము లావలఁ గట్టిపెట్టి సితదత్తు నస్థుల నుత్తమజలముల ముంపునది. ఇదె పిలిచెద చూడు'మని తా నంతరిక్షమున సితదత్తాకారమున నుంచిన చతుర్ముఖుం బిలువ నతండు కన్నీరొలికించుచు వంజరుముందుఁ బడి, 'అన్న ! వంజర !! నాకష్టము లేమని వచింతు? వల దన్నకొలఁది నామాటలు త్రోసిపుచ్చి గంగ కని నీవు వెడలగనె పుత్రవాత్సల్యంబునం జేసి యసువులఁ బాసితి. అంత భయంకరాకారులగు నిర్దయయమభటులు నాప్రాణములం గొని ప్రేతపతిసన్నిధిం బెట్టఁ జిత్రగుప్తుఁ డను మంత్రిపుంగవుఁ డొక కవిలయ విప్పి సూర్యతనయుతో 'మహాప్రభూ ! ఈ జేని కొకకొమరుఁ డుండియు నీతఁ డెంతి సెప్పినను వినక గంగాస్నానమున కని వెళ్ళినపు డీతఁడు మడిసె. పుత్రుఁ డీతని యస్థుల గంగోదకంబులం గలుపనికతన నితఁడు దండనార్హుఁ'డని వచింప విషోరగములు న న్నెన్ని తూవితముల బాధింపఁదొడఁగె. శ్రీమన్నారాయణపాదార విందసేవాతత్పరుఁ డగు నారదుండు నాప్రాణముల సంర క్షించె. కుమారరత్నమా! ఇప్పుడైన గనికర మూని "యపు త్రస్య గతి ర్నాస్తి" యను వాక్యమునుబట్టి గంగోదకముల నామేని ముంచి పదునాల్గుతరములవారిని బంధవిముక్తులఁజేసి యశస్సు నార్జింపు'మని చెప్పి కపటవేషమును వానికడ విడిచి

బ్రహ్మయు నారదుండును దేవేంద్రుపాలికేగి తత్తపోవిఘ్నార్థంబు విధి సంతరితుమున నిలిపి తాఁ జేసిన పన్నుగడంగూర్చి నారదుఁడు సెప్ప నాపురందరుఁడు సహస్రనేత్రముల నానందాశ్రువులు రాల్చుచు దేవమునిం బెక్కు తెఱఁగులఁ గొనియాడి సుఖం బుండెను.

వంజరమహీపాలుఁడు తనజనకు జిరతరమోక్షలక్ష్మి సమన్వితు నొనర్ప నెంచి వింధ్యపర్వతప్రాంతారణ్యమున మురారిప్రియుఁ డగు శంభునిఁగూర్చి ఘోరతపంబొనర్చుచుండెను. కొంతకాలమునకు నే కైలాసవాసుఁడు సర్వప్రపంచములఁబుట్టించి పోషించి గిట్టింపసమర్థుఁడో, యేభక్తమందారుఁడు కపాలమనెడు భిక్షాపాత్ర తనహస్తమున ధరియించి మొదటిభిక్షుకుఁడు తానని ప్రపంచమున నితరుల యాచింపమని విజ్ఞపిగు మూఢుల కజ్ఞానము నశింపఁజేయఁదలపెట్టెనో, యేపరమేశ్వరుఁడు గట్టులతేని ముద్దులపట్టిం జేపట్టి గార్హస్థ్యధర్మమిట్టిదని బోధించెనో, యేభగవంతుఁడు సర్వజనుల సంరక్షింప నెంచి పవిత్రమగు గంగానదిని జటాజూటమున బాలేందుబింబముతోడ ధరించెనో, యేసజ్జనప్రియుఁడు సుహృద్భావమున విసముమెసవి ముల్లోకము లుద్ధరించి మృత్యుంజయుఁడని యెన్నబడుచుండెనో, యట్టి పరమపావనుఁడు లోకరక్షకుఁడు ముక్కంటి వంజరు నెదుట సాక్షాత్కరించి 'వత్సా! నీ కిష్టమగు వరంబు వేఁడు' మన నాసితదత్తతనూభవుఁడు ముకుళిత కరకమలుం డయి.

'కం॥ పవనాశనహృత్త్రామర
పవనాంచచ్చంచరీక! సర్వేశ! హరా!
పవనాశనకృతినాట్యో
త్సవ! నానాదురితదూర! సకలాధారా!

ఎల్ల ప్రపంచముల నీ వుందువు. ఎల్లయు నీలోనుండును. సర్వజ్ఞుఁడవగు నీ వెఱుఁగరానిది లేదయ్యును దేవర యడుగుటచేఁ జెప్పకతప్పదు. మజ్జనకునస్థిపంజరంబును గంగానదిలోఁ గలిపి కృతార్థుఁడ గాఁదలంచెద. ఈశ్వరా! నీజటాజూటవాసిని యగు సురాపగను బ్రసాదింపవే!'యని భక్తుఁడు ప్రార్థింప నాశిష్యవత్సలుఁ డద్దానిఁ బ్రసాదించెను.

గంగాదేవి పంజరుంజూచి, 'రాజా! నే నతిత్వరితగతి భూలోకమున కేతెంచునపు డీవు నాకన్న మున్ముందుగఁ బఱుగులెత్తుచు నీపిత్రస్థిపంజరమున్నస్థానము సూపవలయు, లేదేని నీకేఁ బ్రసన్నరాలఁగా'నని వచింపనాభూరమణుఁ 'డోతల్లీ! సర్వలోకములఁ దానయి సర్వమును బరీక్షించు పరమపురుషుఁ డగు నాదివిష్ణువు పదపద్మముల నుద్భవించి త్రియత్రింశత్కోటిదేవతల ననవరతము బవిత్రులఁజేయుచు భూలోకమునంగల యెల్లనదులలో సర్వోత్కృష్ట వని పేరుఁ గొని యొక్కతూరి నీలో నవగాహమానులయినవారల కమిత సౌఖ్యముల నొసఁగుచుఁ బాతాళమునఁ బ్రవహించి పాపుల కెల్లఁ బద్మనాభునివాసస్థానమగు వైకుంఠముఁ బ్రసాదించెడి మహాత్మ్య నీయది కాని యితరులది కాదు. లోకమాతా! ఆదిశక్తిస్వరూపిణివగు నీ వలిగిన ముల్లోకము లుండునే? అధముఁ

డనగు నే నెంత? నాపయిఁ గరుణింపవే?' యని వేఁడ దేవనది సంతసించి నాకంటెముందుజనుటకై నీవు సర్వజగన్నాథుం డగు శ్రీమన్మహావిష్ణుంగూర్చి తపంబు సేసి గరుత్మంతుని వాహన ముగఁ బడయు మని వచించి యదృశ్యయయ్యెను.

భాగీరథి చెప్పినచందమున సుగుణపుంజ మగు వంజ రుఁడు బహుదోర్దండతపంబొనర్పసంయమీంద్రహృద్గేహంబుల సన్నిదీపకళికచందంబున గోవర్ధనాచలకుహరములఁ దిరుఁ గుచుఁ బలువన్నెలుగల మేఘనాథునిభంగి నానావర్ణం బులు గల సురభిసముదాయమును గాపాడుచుఁ జంద్ర బింబమువంటి శుద్ధస్ఫటికసంకాశం బగు శంఖము మొఱ యించుచుఁ గాలముబుచ్చిన భగవంతుఁడు రాజీవలోచనుండై ప్రత్యక్షమయి 'రాజశేఖరా! నీ యీప్సిత మెయ్యది?' యన నతఁడు 'శ్రీనాథా! కాలత్రయరూపుఁడ వగు మురహరీ! నల్లనయి తుమ్మెదరెక్కలఁబోలు నీ ముంగురులును సొగసగు పదనారవిందమును విశాలమగు నేత్రయుగ్మమును దొండ పండునేని నగఁజాలు కాంతిమంతమగు నధరంబును బ్రకాశ వంతము లగు చెక్కిళ్ళును నబ్జంబుబోలు కంఠంబును కాంతి మంతంబులగు మకరకుండలద్వయమును నతనాభియు నెత్తగు భుజములును నీలమేఘశ్యామమగు శరీరమును భూమి యను పాదములును శిరస్సను నంబరమును వేదంబులను సుచ్ఛ్వా సంబులును గలిగి యెల్లస్థలములఁ బ్రకాశించువానిఁ ద్రిలో కైకసంరక్షణాత్యంతదక్షుఁడైనవాని నిన్ను మనోవాక్కాయ కర్మములచేత షడూర్మ్ముల లోపఱచుకొని దివ్యదృక్కులతోఁ

గాంచని క్రూరజనుస్సుండు పాషాణంబురీతి వ్యర్థజన్ముఁడై ము
ముక్షువు కాఁజాలఁడు. నారాయణా! ఈవు భక్తాగ్రగణ్యు
లకుఁ గొంగుబంగారమవు. శేషశయనా! సురాపగను భూలో
కమునకుఁ గొంపోవుటకు దారిఁజూప నాకు వాహనముగ
వైనతేయుఁ బ్రసాదింపవే' యని కోర నా లోకలోచనుఁడు
"తొల్లి నంజరుఁడు కర్కటిబిడ్డగ నుండి గంగాప్రయాణోన్ముఖుం
డయినప్పు డొక్క విహంగమము వానిం జంపి భక్షించుటచే
"భృత్యపాపం నృపం వ్రజేత్" అను న్యాయముచొప్పున గరు
త్మంతుఁడు నంజరునకు వాహనం బయి యతని సఫలీకృత
మనోరథుంగావించున" దని వచించెను.

మురారివాహనరాజ మగు గరుత్మంతుపయి నంజ
రశ్రేష్ఠుఁ డెక్కుడు లోకమాత యగు గంగ వృషకేతుజడల
నుండి బయలువెడలి గరుత్మంతునికన్న మున్ముందుఁ బోవల
యు నన్నకోర్కెతోఁ దానును సురనదికన్న వేగంబ చనవల
యు నని వైనతేయుండును దమతమమనంబుల నిశ్చయించు
కొని యన్యోన్యజయాభిలాషులయి పరువులెత్తుచుండ ధరా
ధరములు నుగ్గునుగ్గుగను మహీరుహములు చెల్లాచెదరుగను
ఒకపతిస్వ్యవదములు నంకోపనండఁబులుగను నశింపఁజేసి
యూర్ధ్వలోకముల కఖండభయోత్పాతంబు నాపాదించుచు
నధోలోకవాసులు నివ్వెఱపడిపోవుచుండ జలనిధులు పొర్ల
దిక్కులు మాఱుమోఁతలీన యక్షకిన్నరకింపురుషాదులు
స్తోత్రము సేయుచుండ నావిష్ణుపుత్త్రిక సితదత్తుకృతకళశవంబు
పయి తళతళమెఱయుకాంతులతో బొరబొరను పొంగు

ధ్వనులతో దుమికి పాతాళమున కేగెను. బొల్లి మోము పులుఁగు రమానాథుపాలికిం జనియెను. వినిర్మలస్నిగ్ధ పావన గంగా జలంబులం గపటరూపముననున్న సితదత్తుకళేబరము సిక్తమగుటం జేసి నాకలోకమున వసించుచున్న సితదత్తుఁడు సత్యలోకమున కేగి సుఖం బుండె. వంజరుచే వ్యోమకేశుజటాజూటమునుండి భూలోకమునకుఁ దేఁబడినకతన గంగకు వంజర యనునామాంతరముగలిగి మధ్యమలోకవాసుల కెల్లరకు. ముక్తి ప్రదాయిని యయ్యెను.

ఓ బ్రహ్మచారీ! కృతజ్ఞతకు ఫలము పితృభక్తి. పితృదేవతల నుత్తమగతి కంపుటకు శల్యములు పుణ్యనదులందుఁ గలుపుట జగద్విదితము. అత్యంతభక్తితోఁ బితృశల్యములపై హరజటాజూటాంతస్థితయగు గంగను పాఱించి తన నామమును బ్రహ్మాండమున నిల్పి పితృభక్తిపరాకాష్ఠను లోకమునకుఁ దెలిపియున్న వంజరుఁడు ప్రశంసార్హుఁడు గదా!



# VII

## అన్నదానమహిమ.

శ్రీమంతం బగు భరతఖండంబున నున్నత ప్రాకార విరాజితంబును సముత్తుంగసౌధపాళీవిభ్రాజితంబును ననేక హరిహరాలయావళీమండితంబును సమధికానుకూల్య సంపత్సంశోభితచాతుర్వర్ణ్యగణనీయంబునునయి భూరమణీమణీనూపురాయమానంబగు పుష్పవతీపురంబు నగరంబు ప్రకాశించుచుండు. అందు నిఖిలనిగమాగమపారగుండును షట్ఛాస్త్ర రహస్యవేదియుఁ బ్రతిపదోజ్జ్వలరసవత్కవితాసతీమనోహరుండును నగు శంభుశర్మయను బ్రాహ్మణుం డొక్కండు గలండు. ఆతనికి వేదత్రయంబునా మూర్తిత్రయంబునా శక్తిత్రయంబునా మించు పవిత్రంబగు పుత్రత్రయంబు వఱలు. వారు కేశవశర్మ నారాయణశర్మ మాధవశర్మ యను నామంబుల నొప్పి చతుర్దశవిద్యాపారంగతులయి సత్కులజాతలగు లక్ష్మీ వేదవతీ రుక్మిణి యను కన్యకలం బెండ్లాడి స్వస్వకృత్యముల నప్రమత్తులయి ప్రవర్తిల్లుచుండిరి. అందు మాధవుం డనుదినంబును బరమేశ్వరు నీరీతి నారాధించు.

'సీ॥ ఆవాహనంబు బ్రహ్మాండపిచండున
కాసనంబు హృదంబుజాసనునకుఁ
బాద్యంబు పావనపదపయోజాతున
కర్ఘ్యంబు విష్ణునేత్రార్చితునకు

నాచమనీయ మాసేచనకముఖున
కవగాహనము మస్తకాపగునకు
నంబరయుగము దిగంబరునకు జందె
మహీయజ్ఞసూత్రున కమలగంధ

గీ॥ మంతునకు ప్రసవదళము లవ్యయునకు
ధూపదీపము లిన్యస్వరూపకునకు
నాదిమాపోశనము కరుణాంబునిధికిఁ
బాలుఁ బండ్లు నైవేద్యంబు భవహరునకు'

నారాధించి పరమేశ్వరరూపులు గాఁదలంచి బ్రాహ్మణుల సభక్తిగ భార్యాసమేతుఁడయి పూజించి చతుర్విధాన్నములఁ బరితృప్తుల నొనర్చుచుండును.

అతిథిసంతర్పణంబున లోకోన్నతకీర్తి నార్జించిన రుక్మిణీమాధవశర్మలవైభవంబు సూడనోపక దోఁడికోడండ్రు లక్ష్మీదేవవతు లాఁడుబడుచులు వేశ్వర కేశవనారాయణశర్మల కేకాంతమున నిట్లుదుర్బోధ లొనర్పఁగడంగిరి. పితృయంబున మీస్వార్జితంబులను నశేషధనంబుల నతిథులనియు నభ్యాగతులనియు గురువులనియు స్వాములనియు వెచ్చించుచుఁ బేరుప్రతిష్ఠల నాకేఁడార్జింపనేల? మీ రుదాసీనులరై యుండనేల? అది యట్లుండ నాబడి, యాసుసాధ్వి, యారుక్మిణి కార్యకరణంబుల మమ్ముం జేరికింగొనక సూటిపోటి మాటలఁ గ్రుణీకరించుచుండు నిద్దాని నెంతకాల మని సైరింతుము? ఇఁక సోదరోత్తముండు నెక్కాలంబు తనసతి బ్రా

మనకే కాదు లోకముల సన్నదమ్ముల కేరిక్కైన నిదియే పరమధర్మ' మని వచించిరి.

ఆహా! కాలవైపరీత్యము! సద్గుణగరిష్ఠుఁడును సదాచారపరిపూతుఁడును నగు మాధవశర్మకర్తృకాన్నదానమే యన్నదానము. అట్టిశ్రోత్రియాన్నదానము ఎన్నిజన్మములలో చేసికొన్న సుకృతవిశేషంబుననోగాని సిద్ధింపదు. శూద్రశ్రాద్ధాన్నమును భగవదనివేదితాన్నమును బుంశ్చలియన్నమును నవీరునన్నమును భుజించువాఁడు మాంసభక్షణజనితపాపము నొందును. శూద్రయాజకు నన్నమును వైద్యకద్విజునన్నమును దేవలాన్నమును గన్యావిక్రేతృనన్నమును నుచ్ఛిష్టాన్నమును బర్యుషితాన్నమును భుక్తశేషాన్నమును శూద్రాపతియగు ద్విజునన్నమును వృషభాధిష్ఠితద్విజునన్నమును నదీక్షితద్విజునన్నమును శవదాహకునన్నమును మిత్రద్రోహియన్నమును మిథ్యాసాక్షియన్నమును భక్షించు పాపాత్ములు భగవన్నివేదితాన్నభక్షణమున బరిశుద్ధులగుదురు. భగవద్భక్తుఁడు శ్వపచుఁడైనను వంశము నుద్ధరించును. అజ్ఞానంబుననైన నిర్మాల్యమును గ్రహించిన యనేకజన్మార్జితపాపములనుండి విముక్తుఁడగు. జ్ఞానమున భగవన్నిర్మాల్యమును గ్రహించినచోఁ గోటిజన్మార్జితానేకపాతకనిర్ముక్తుఁడగుట కెట్టిసందియము గన్పట్టదు. ఘోరార కాలమహిమ! కేశవనారాయణశర్మలు శ్రుతవంతులయ్యు సర్వదానముల నుత్తమోత్తమమైన యన్నదానము నొనర్చు ననుజుని వేలువెట్ట సాహసించిరిగదా!

అగ్రజు లిరువురు సోదఱు వేఱుసేసిరి. అన్న లిద్ద ఱేక
ముగనుండి పెక్కుసంతానముం బడసి యీఁదఁజాలక యజ్ఞా
నాంధకారబంధురం బగు సంసారకూపమునఁబడి దారిద్ర్యము
తట్టుముట్టాడుచుండ, మాధవశర్మ వయస్సున బిన్నయయ్యు
గుణములఁ బెద్దయగుడు సౌజన్యమున నెల్లయతిథులతో పాటు
సపుత్రకళత్రంబుగా తన యగ్రజద్వితయంబు రాఁ బిలిఁచి
గుణఖనియగు రుక్మిణి యనన్యభక్తి సాయపడ సకాలమునకు
జతుర్విధాన్నముల సంతృప్తులఁ జేసి వీడియమొసంగి యాద
రింపుచుండు.

ఇట్లు సనుచుండ నొకనాఁ డతని యిల్లాలు నాథు
పాలికిం జని 'స్వామీ! మన మనవరతము విప్రసమారాధన
తత్పరులమై బ్రాహ్మణోత్తముల కన్నమిడుదుమే. దానం
గలుగు పుణ్యవిశేష మెయ్యది? ధర్మచారిణి నగు నా కనుగ్ర
హంబున బోధింపుఁ డనవుడు నతఁ 'డోపద్మాక్షీ! పెక్కు
రతిథి సత్కారము మంచిదని చెప్పవింటిగాని యందలి ఫలిత
మెట్టిదియొ యెవ్వరు సెప్పినవారుగారు. నేఁడు మన నుద్ధరింప
నేతెంచు బ్రాహ్మణోత్తముల గొనియాఁడి తద్విశేష మెఱుం
గుద'మని చెప్పి నాఁడు తన యింటికరుఁగుదెంచిన భూసుర
శ్రేష్ఠుల చక్కఁగ గారవించి, 'సర్వశాస్త్రపారంగతులగు
నో భూసురోత్తములారా! మాయెడ నెనరుంచి యన్నదాన
మహిమ నెఱిఁగింపుఁ' డని కోరిరి. విద్వద్బ్రాహ్మణ సంఘ
మాప్రశ్న కుత్తరంబిడనేరక యన్యోన్య ముఖావలోకనంబు
లకుఁ గడంగుఁడు శివశర్మయను బ్రాహ్మణుం డొకండులేచి

'గృహమేధీ! నీ యడిగిన సంప్రశ్నమున కుత్తర మిచ్చుటకై
నేర్పు వేయినోళ్లుగల చిలువలఱేనికిఁ గలదేమో? సహస్ర
కరములుగల సూర్యభగవానుఁడు వ్రాయఁగలఁడేమో? యన
మానవమాత్రుండ నే నుత్తరం బీగలనా? నీవడిగిన దానికి
జగజ్జననియుఁ గాశీపురీవాస్తవ్యయు సదాశివకుటుంబినియు
నగు నన్నపూర్ణామహాదేవియె యుత్తరము సెప్పఁగల'
దనవుడు మాధవశర్మ భిక్షుకునింగాంచి 'భిక్షుకా! వింటివా
విప్రవాక్యము? తేపకడ వారణాశి కేగి భాగీరథీస్నాతుఁడనై
సపరివారులగు యన్నపూర్ణావిశ్వేశ్వరుల ననవిధభక్తి నారా
ధించెద. శ్రీమదన్నపూర్ణామహాదేవి కటాక్షమున నన్న
దానఫలంబు నెఱింగి వచ్చెద. నే వచ్చునంతక బ్రాహ్మణా
రాధనంబున లవంబును గొఱంతనడకుండున ట్లాచరింపుమీ'
యని చెప్పి కేఁగింటిపరిసారంబుల నాయువతి సంతుష్టం జేసి
కాశీ కేగెను.

హిరణ్యగర్భప్రముఖనిఖిలసుధాంధశ్శిరఃకిరీటమణిగణ
ప్రదీపనీరాజితపాదారవిందసీతుండగు కంజాక్షుండు పుష్పవతీ
పురంబునందు భిక్షునీసలింబరీక్షింపనెంచి యష్టదరిద్రు
రాలునిగా నొసర్చినను యాపె తన నైజపతిదేవతాత్వమాహా
త్మ్యమును నాపలయు లోటురానీక బ్రాహ్మణసమర్చనం
బొనర్చుచుండె. ఒక్కనాఁడాదివిష్ణుఁడు యంతంత్ర ప్రెస్నాం
దక వికృతాకారంబున వృద్ధబ్రాహ్మణవేషధరుండై మాధవ
శర్మగృహంబుసేర నాపతివ్రతాశిరోమణి యాతఁడు కపట
వేషధారి యని తలంపక యెంతదవ్వులనుండి నడచివచ్చెనో

యని డస్సియున్నవానిఁ గూర్చుండఁబెట్టి యడుగులు గడఁగి విసనకఱ్ఱచే సేదదీఱునట్లు విసరుచు 'స్వామీ! ఎటనుండి యెట కేగుచు మముఁగృతార్థులఁజేయ నిటకువిచ్చేసితి'రనియడిగెను. అంత నాషరంధాముఁడు, 'పతివ్రతాశిరోమణీ! ఆసేతుహిమాచలపర్యంతముంగల దివ్యతీర్థముల సేవించు యస్మాదృశుల కొక స్థలమునుండి మఱియొకచోటికి కేగుటయ స్వభావంబు. నేఁడు భవదాతిథ్యమునొంది మిన్నంది యానందింప నిందుఁ బ్రవేశమునకు మూలకారణము. అమ్మా! నీవు కడు పుణ్యరాశి వని విందుము. కడుంగడుదూరము పయనముసేసి డస్సి యున్నాఁడ. కృపవహించి త్వరితముగ వంటకంబుసేసి పెట్టుము. "జీవనంబు క్షణభంగురం"బని వచింతురుగదా? నీవు పచనమొనర్చి పెట్టువఱకు నసువులుండు నట్లగపడుట లే'దనవుడు నా సాధ్వి వంటచేయనెంచి వీక్షింపఁ గుండలో తండులంబులు నిండుకొన్న మనంబుననుండు ధైర్యమున నడుఁగునంగల కొన్ని గింజలుమాత్రము లభింప వానిం గడఁగి పచనముసేసి యుంచ విప్రహూపాభిధేయాభిశోభితుండగు మాధవుం డామెను పెక్కు తెఱఁగుల గారుమాటలాడుచుండ, లెక్కకు మీఱిన పెక్కురు బాప లుస్సు రుస్సు రనుచు తలుపు నెట్టుకొని లోనికిరా వారల నెల్లర స్నానమాడుఁడని ప్రార్థించి నీళ్లకడవల క్రిందనున్న యిసుకను చేటలతో చెఱిఁగి పచనముసేసి యెల్లరకును షడ్రసోపేతముగ భోజనము పెట్టెను.

అంత "సభ్యాగత స్స్వయంవిష్ణుః" అను మహావాక్యము నకు సర్వంకషమగు వ్యాఖ్యాన మొసరుపఁ దలఁచి శ్రీమన్మ హావిష్ణుండు.

సీ॥ గ్రైవేయకంకణాంగదహారకుండల
ప్రభ లలితస్ఫూర్తిఁ బరిఢవిల్ల
నవరత్నకీలితోన్నతకిరీటద్యుతు
లాశావకాశంబు నలమికొనఁగఁ
గటివిలంబితహేమకాంచీవిలగ్నమై
రాజితపీతాంబరంబు మెఱయ
శ్రీవత్సకౌస్తుభ శ్రీసమాయుక్తమై
తులసికాదామంబు తొంగలింప
నతిరయంబున గరుడవాహనసమేతుఁ
డగుచు విష్ణుండు శంఖచక్రాది విశ్రు
తాయుధంబుల ధరియించి యాపెఁ బ్రోవఁ
దక్షణంబున నచటఁ బ్రత్యక్షమయ్యె."

పుండరీకలోచనుం డట్లు సాక్షాత్కరించి రుక్మిణితోడ, 'నో సతీతిలకమా! నీగుణంబు లగణ్యంబులు. తొల్లి యొక్క స్త్రీలలామగాదె తన యసమానపాతివ్రత్యమహిమచేఁ బెనిమిటకోర్కి నెఱవేర్ప నెంచి యాతని పదపద్మముల మూర్ధమున దాల్చి మహారణ్యమున వెడలుతఱి యప్పావము లోక ఋషిపుంగవునకు తగులుడు నతం డలిగి పద్మబాంధవు డుద యించు లోపల నతం డస్తమించునట్లు శపియింప విని తత్సతి భర్తృప్రాణసంరక్షణార్థమయి సూర్యుం డుదయింపకుండు

న ట్లానవెట్టె. అంత పతివ్రతాశాపభీతుండయి భానుం డుద
యింపమి కాలచక్రగమనమునకు నిరోధంబగుటను పద్మ
గర్భాదులు సుమతిం బ్రార్థింపఁగాఁ దన భర్తృప్రాణముల
కపాయము వాటిల్లకుండు పద్ధతిని యనసూయ హితవుంగొని
సూర్యుం డుదయించుటకు సమ్మతించె?

విగతప్రాణుండగు సత్యవంతుని మేని నొక్క వృక్ష
మూలంబున భద్రపఱచి యముని వెంటనంటి తదనుగ్రహంబున
సత్సంతానములకు కన్నులును రాజ్యమును తన జనకునకు
నూఱుగురు పుత్రులును దన కొకసుతశతముం బడసి భర్తృ
ప్రాణములం బొంది సుఖమున్న సావిత్రి రమణీశిరోమణి కాదా?

పెద్ద ముత్తైదు వని పేర్గాంచి యనవరత మంబరవీథిం
బతిననుసరించియుండు నరుంధతి సతీరత్నమని యెఱుంగుదు.
యోగ్యురా లగు గృహిణి సహధర్మచారిణియయి గృహ
కృత్యములను చక్కఁగ నిర్వహించును; భర్తకు సంతతినిచ్చు
ను; సర్వవిధముల భర్తకు సాయపడును; భర్తృసుఖసంపా
దన విచారముతప్ప యన్యచింతఁ గలిగియుండదు. సత్కళత్రము
ప్రపంచమున ధర్మసాధన కుపకరణము; గృహనీతివిద్యకు
గృహము; విమలచారిత్రశిక్ష కాచార్యకము; వంశస్థితికి
మూలకందము; సద్గతి కాధారము; గౌరవమునకుఁ గారణము.
స్థిరగుణములకు నిలయము; హర్షామోదమునకు సంజనకము.
సత్పురుషునకు ప్రపంచములో సకలసద్గుణగరిష్ఠురాలగు
భార్యకన్న నితరము లెయ్యవియుఁ బ్రియములు గాఁజాలవు.
భార్యాపుత్రాదుల గౌరవించెడు పురుషునకెట్టి విషమప్రదేశ

ములయందును నెట్టి యాపత్సమయంబులయందును నప్ప
తిల్లిన యిక్కట్టు లెల్లయు భానునికాంతిచేఁ గరఁగిపోవు
మంచురీతి మటుమాయమగును. ఓపద్మముఖీ! భూసురవంశా
వతంసులెల్లరును వివిధములగు మజ్జనభోజనపూజనాదిక పరి
చర్యలమూలమున సంతసంబు సేకూర్చి రక్షించు పరమపతి
వ్రతాశిరోమణి వగు నీవ చెల్లెదు. నీకిష్టమగు వరంబు నెద్ది
యేనిం గోరు' మని పుండరీకాక్షుఁడు మృదుమధురవాక్కు
లతో నుడివెను.

ఆ విప్రసతి పరమానందభరితురాలయి కరములు
మొగిడ్చి, 'జగదాధారా! సోమకాసురుఁడు తస్కరించిన
వేదరాశి మత్స్యావతారంబున దెచ్చి పితామహున కొసఁ
గితివి. భక్తమందారా! దుర్వారకోపస్వభావుఁడగు దుర్వా
సుని శాపాగ్నిచే నిలింపుల సర్వభాగ్యంబు లంభోనిధిం బడ
మందరపర్వతమును కవ్వముగను వాసుకిని దరిత్రాడుగను
దేవదానవులు మధించువారుగ నొనర్చి యాదికూర్మము
రూపమునం బూని సమస్తైశ్వర్యముల గీర్వాణుల కొసఁగి దివ్య
మంగళనామములం గనిం బొందితివి. దయాపయోనిధీ! శిఖిశిఖాగ్ర
భాగమున నొప్పు గోళాకార ధూమంబుభాతి విలయకాల
మున కిటివై జలార్ణవమున మునుఁగనున్న భూగోళముపై కెత్తి
భయనిశితదంష్ట్రాగ్రమున హిరణ్యాక్షు రూపు మాపితివి.
కమలనయనా! భవత్కరాగ్రములచే లోకకంటకు హిరణ్య
కశిపు నృసింహావతారముఁదాల్చి పరిమార్చితివి. భువన
విద్వేషిగజాంకుశా! దితిసుత నిర్మూలనాకాంక్షివై మరుగుజ్జ

వేసమున బలిని మూఁడడుగుల మేర నడిఁగి ముజ్జగంబులు నీవదై రక్కసుల జక్కడఁచి బలిని పాతాళమున కణఁగఁ దొ్రక్కి దేవతలఁ బోషించితివి. పితృవాక్యపరిపాలనాదక్షా! జనకు నను జ్ఞ జననిని సోదరులను గఱఁకుగొడ్డంటఁ బెగ నటికి జమదగ్ని నమందానందమున నోలలాడించి దివ్యవర ప్రసాదమునఁ బునర్జీవితుల నొనర్చి పతిపంథి రాజచూడా మణుల నిఱువదియొక్కమారు చీల్చి, చెండాడి, స్వర్లోకమున కంపితివి. దానవాంతకా! భవన్నిశితశరాసారంబులచే లోకవిద్రావణుండగు రావణు సపుత్రమిత్రకళత్రంబుగఁ బరిమార్చి భూసుతను దెచ్చిన మేటిధీరుఁడ వీవు. లోకరక్షకా! దుష్టసంహారణార్థమయి ఫణిరాజమగు నాదిశేషు బలరాముఁ డను పేర నుద్భవింపఁజేసి శ్రీకృష్ణుండ వీవై కూ్రరశాత్రవ ప్రాణానిలములఁ గొనవా? పరాత్పరా! పురుషోత్తమా! సమస్తభోగముల విడనాడి దుష్టమృగభూయిష్ఠమగు నరణ్య ముల కేగి కటికిఱా నేలసెజ్జలు సుఖప్రదము లని భావించిన బుద్ధుండ వీవు. హృషీకేశా! మధ్యమలోకపుదుర్మార్గపు టుత్పత్తికిఁ గడుంగడు నలిగి శంబళయను గ్రామమున స్వయం వ్యక్తుండవై యుద్భవించి పాపుల రూపుమాపి నూత్నసిద్ధాం తముల నెలకొల్పెడువాఁడ వీవకాదె? పురుషసింహమా!

క॥ మాయాపదఁ బాపుము వా
లాయ మశక్తులము "దుర్బలస్య బలం రా
జా"యని యజేయుఁ ద్విజగ
న్నాయకుఁ జక్రధరు నిన్నె నమ్మితిమి హరీ!"

యని చరణ నలినంబుల వ్రాలెను.

ఉజ్జ్వలగుణరత్నాకరం డగు నామహావిష్ణు వామహాపతి దేవతం గని, 'సాధ్వీమణీ! బంగరునకు పరిమళం బబ్బినభంగి శ్రీమన్నారాయణపాదారవిందనిరంతరధ్యానాసక్తమగు నీచేతస్సు సుగుణసంపత్తి కెంతయు వన్నె దెచ్చె. ప్రపంచమున నన్నదానఫలమును మించిన సుకృతం బేదియు లేదు. మీదంపతు లనవరతము నను సంతోషింపం జేసితిరి. మీ మనంబున నుద్భవించిన నిరంతరదైవభక్తికిని జ్ఞానసంపత్తికిని హెచ్చుగ మెచ్చితి. నీ యాశ్రితశతంబుల క్షేమ తెలుపుము. సఫలీకృతమనోరథురాలుగా నొనర్చెద' నని నీలమేఘశ్యాముండు మేఘగంభీరారవంబునం బలికెను.

సకలసద్గుణగరిష్ఠురా లగు నావధూమణి, 'లక్ష్మీ మనోహరా! నిచ్చలు నీ పదపద్మములయందు తగని బత్తియు నతిథిపూజయం దనవరతాసక్తియు సుగుణవత్సంతానసంపత్తియుం బడంపడి ముక్తియు నొసంగ నీవ మాపాలి భాగ్యంబ' వనుచు భక్తహృదయాబ్జభాస్కరుం డగు భగవానుని నిండుమనంబున

"అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష జనార్దన."

అని స్తోత్రముసేయ హరి యాయమమనోరథంబుం దీర్ప నెంచి కరుణాతిశయుండయి సకలకిల్బిషహరణసమర్థం బగు తీర్థంబుల నవగాహులు లయి భక్తజనస్తోత్రపాత్రం బగు వైకుంఠమున కేతెంచున దని వచించి యదృశ్యుం డయ్యెను.

పుణ్యతీర్థమగు కాశికిఁ జేరిన బ్రాహ్మణోత్తముఁడు భాగీరథీతీర్థములయందు నవగాహితుండై కమలేశ్వర భర్తృహరీశ్వర నీలకంఠేశ్వర త్రిలోకేశ్వర మాతంగేశ్వర మణికర్ణికేశ్వర గంగాశ్రీసంగమేశ్వ రాదికము లగు శివలింగస్థానములఁ గనుచు నన్నపూర్ణం బూజింపుచుండ నొక్కనాఁ డా హైమవతి భక్తుని సందియంబు వాపనెంచి దేదీప్యమానమగు దివ్యవిగ్రహముతోఁ బ్రత్యక్షమై 'భూసురోత్తమా! నీ మనంబునం గలుగు సందియంబు దీర్ప పరమేశ్వరుం డగు విశ్వేశ్వరుఁడుతక్క నన్యులు నేరరు. నా యెఱింగినంతఁ జెప్పెద వినుము. హిమవత్పర్వతము చేరువ వారణగంగ యను బరఁగు నది ప్రవహించుచుండు. ఆ నదిగట్టున సమస్తవస్తుభరితంబులగు విపణివీథుల నొప్పారు హేమవతీనగరంబు గలదు. సర్వజనాంగీకారముగ పరిపాలనఁ జేయుచు సదా బ్రహ్మచారి యని పేర్వడసిన యంగీరుఁడను రాజు పతివ్రతాశిరోమణియు దైవారాధనతత్పరయు నగు సుమతి యను దానితోఁ గాఁపుర మొనర్చుచు సంతానకాంక్షచేఁ బెక్కువ్రతము లొనర్చుచుండు. భూసురాగ్రణీ! నీ వచటి కేగి మదీయానుగ్రహంబున వారల కొక సన్మహాకారుఁ డగు నందనుఁ డుద్భవించుననియు మాతృగర్భము వీడి పురిటింటిలోఁ బడెడు కుఱ్ఱఁ డన్నదానఫలమును గూర్చి చెప్పుననియుఁ బుత్త్రుఁ డుద్భవింపఁగనే తెలుపవలసిన దనియు నా భూరమణునకుం బట్టపుదేవికిం దెలుపు"మని వాక్రుచ్చి యంతర్ధానమయ్యె.

అంబికచెప్పినదాని కచ్చెరువందుచు నుత్తరాభిముఖుం
డై వివిధకుసుమఫలభరితంబులయిన వృక్షముల వీక్షించుచుఁ
జనుచుండ సహస్రకిరణుఁ డపరాద్రి నధిష్ఠించెను.
మార్గము దప్పి పోవుచున్న మాధవశర్మను సమీపనివాసి
యగు చెంచువాఁ డొక్కండు కని వాని సత్కరింపనెంచి డాసి
నమస్కరించి, 'స్వామీ! ఎటనుండి యెటకేఁగుచున్నారలు?
పొద్దుగ్రుంకినది. మార్గమా కన్నులకు గన్పింపదు. ఇదియా
సాంద్రారణ్యప్రదేశము. నాయందు కృపవహించి నేఁటి
రాత్రికిట వసించి నను ధన్యుఁగావించున'డని వేఁడుడు మాధవ
శర్మయు నారేయి నట వసింప నాచెంచువాఁడు చేరెడు వెదురు
బియ్యమును దేనెయునొసంగ వానినాహారముగఁగొనియెత్తగు
మంచెపయి నిదురవోవుచుండెను. చెంచుదంపతులు భద్ర
ముగ విప్రుఁ గాపాడుచుండ మువ్వన్నెమెక మొక్కటి కాండ్రు
కాండ్రనుచు కేకలువేయుచు సజ్జనుఁడగు చెంచువానిం జంపి
చెంచెతచే విడువఁబడిన శరములఁ' గూలెను.

పద్మబాంధవుఁ డెఱ్ఱనికిరణజాలముతోడఁ దూర్పు
కొండ నెక్కెను. భర్తృవియోగాగ్ని భరింపఁజాలకున్న యా
చెంచెతం గని భూసురశ్రేష్ఠుఁ డెంతయు బిట్టువగచి చెంచెతా!
కుమ్మరి మట్టిం గొని సారెం బెట్టి కఱ్ఱత్రిప్పుచుచేఁ గుండలఁ
జేయునట్లు విరించి సర్వభూతములకు ఫలం బిచ్చుచుండు.
వెఱ్ఱివై వగవకుము. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ
శుభాశుభ" మ్మండ్రుగాదె? నొసటివ్రాఁతఁ దుడువ నేరును
నేరరు. అది నేర్చినచో మహావిష్ణుఁడు మన్మథు ముక్కంటి

నిటలాక్షమున కాహుతిసేయనేల? నారాయణాంశసంభూతుఁడగు నర్జునుం డనన్యసామాన్యమేరుధీరుఁ డగు నభిమన్యుఁ గోల్పోవ నేల? త్రిలోకాధీశ్వరుం డగు మృత్యుంజయుఁడు సతీమతల్లి యగు సతి నగ్నిసాత్ప్రాప్తసేయనేల? సాధ్వీ! చింతింపకు "గతజలసేతుబంధనంబు" వలన నావంతయు లాభముండదు. నేఁడో మాపో ప్రతిజీవియుఁ దా నెచ్చటినుండి యేతెంచెనో యచ్చటి కేగకతప్పదు. జీవనం బస్థిరమని చెప్ప వినమా?' యని యోదార్పుడు నాయువతి హేమవతీపురంబున కేగుదారిఁ జూప నతఁడు సకలసుహృజ్జనోపేతమగు నాపట్టణంబుఁ జేరి రాజచూడామణిం గలిసికొని చక్కఁగ బహూకరింపఁబడి గట్టులజేనిముద్దులపట్టి తన కెఱిఁగించిన యర్థంబెల్లయుఁ జెప్పఁ బరమానందమున నాఱేఁడు ధనకనకవస్తువాహనాదుల సతీమతల్లి యన నతికెక్కిన పడఁతితోడ సమర్పింప నతఁ డన్నింటింగొని పరమేశ్వరివచియించిన తరుణముసకై యెదురుసూచుచు నప్పురంబునవసింపుచుండెను.

పుణ్యకర్మనక్తులును వివేకవంతులును సత్కార్యాచరణపారీణులును నగు నారాజదంపతు లహింసయే పరమధర్మముగ నెంచుచు బీదలపాలిటి పెన్నిధులయి యసహానములేక వైదికధర్మతత్పరులయి పితృగురుహరిభక్తియు నత్యంతానురక్తియు నినుమడింప లోకమున నెల్లరచే శ్లాఘనీయులయి వెలుఁగుచుండ కాశికాన్నపూర్ణాకృపాతిశయంబున నవమాసములు నిండ నావెలఁది సుగుణాలవాలుఁ డగు నొక్కపుత్రుఁ గాంచెను. అంత మాధవశర్మ శీఘ్రగతి నామొగసాలఁ జొచ్చి

కరకమలములు మొగిడ్చి 'రాకుమారా! అన్నదానంబువలని
ఫలితమెట్టిదియో తెలిసికొనఁగోరి విశాలాక్షి హిమవన్న
గేంద్రనందినిం బ్రార్థింప నా జగజ్జనని ప్రత్యక్షమై యంజలి
రహస్యము నిన్నడిఁగి యెఱుంగుమని వచింపుడు నే నిట
కేతెంచితి నానతీయవే' యని ప్రార్థింప నాబాలకుఁ, 'డోద్వి
జోత్తమా! నీవు పరమేశ్వరివలన సెలవుగైకొని యిప్పు
రంబున కేఁగుదెంచెడుతఱి మార్గమధ్యమున నలనాఁడు
ప్రొద్దుగ్రుంక మిమ్మాహ్వానించి యొక్కచేర వెదురు
బియ్యమును దేనెయు నిడి మిము సంప్రీతుఁ గావించి
మంచెపయిఁ బరుండఁబెట్టి సుఖంబున శయనింపఁజేసినందు
లకుఁగాను సమస్తభాగ్యభోగ్యములకు నెలవై మహేంద్రుని
వైభవములఁ దులఁదూఁగు నీ రాజున కుద్భవించితి. ఇఁక
సతత మన్నదానముసేయు నీకుం గలిగెడి భాగ్యము లిట్టి
వనియు మోక్ష మీరీతిగ నందుననియు నేరీతిగ వచింపఁ
గలమో నీవే యోచింపు' మని మందస్మితసుందరవదనార
విందుండగు నా సాపఁడు పలుక, భూసురుం డత్యద్భుతాంత
రంగుండగుచుఁ బెక్కుతెఱంగుల నాబాలకు స్తుతియించి సెలవుఁ
గొని మఱల కాశి కేగి గంగలోఁ గ్రుంకి శ్రీవిశాలాక్షీవిశ్వ
నాథులఁ గాంచి పరమేశ్వరికిఁ దాఁ గన్నదియు విన్నదియు
నెఱిఁగింప నా తల్లియెంతయు మెచ్చి గృహంబున కేగు మని
సాదరంబునవచియింప నా విప్రుఁ డెన్నియోవితముల విశాక్షీ
కరుణనుగూర్చి కొనియాడుచు కతిపయదినంబుల కిలుసేరి
తనసతికిఁ దా నిలు వీడినదిమొదలు మగిడి వచ్చువఱకుఁ

జరిగిన సర్వవృత్తాంతంబుసెప్ప నాతని కా గృహిణి శ్రీమన్నారాయణసత్సందర్శనాది సమస్తచరిత్రంబును విన్నవింప నుభయులు సంతుష్టాంతరంగులయి పెద్దయుం బ్రొద్దు వినోదించిరి.

రుక్మిణీమాధవశర్మ లెల్లదానంబులయందు నన్నదానం బసమాన మనియెంచుచు లోకరక్షకుఁడగు నీశ్వరుచరణంబులు తమకు శరణ్యంబులుగానూహించి ప్రవర్తిల్లుచుండుడు ధనధాన్యసమృద్ధియుఁ బుత్రపౌత్రప్రపౌత్రాభివృద్ధియుంగలిగి పూఁచిన తంగేటిచంపమునసుండ నొక్కనాఁడు నీరజబాంధవసదృశం బగు వదనము శ్రీవత్సవిభ్రాజితవక్షస్థలముంబోలి గోపికాబృందస్నేహభూరుహపరిపక్వఫలం బనంబరఁగు శ్రీమన్మహావిష్ణుండు దివ్యరథంబునం బ్రత్యక్షమయి నాతంపతులం గొని నారదాదిమునిగణంబులును బ్రహ్మరుద్రాది దేవతలును జయ జయ శబ్దంబులతోడఁ గదలిరా నిజభవనంబునకుం జనియె.

ఓ తెలివికాఁడా! ప్రపంచమునంగల సర్వదానంబుల యన్నదానము శ్రుతీతిహాసముల దద్దయుఁ బెద్ద యని వర్ణింపఁబడినది. అందు నీరే ప్రాణాధార మను న్యాయముచొప్పున నానుషంగికముగా మంచితీర్థదానము సేరియుండుటఁ బ్రాణదానసుకృతముకూడ దీనిద్వారా నన్నదానపరులుగాం చెదరను నంశము జదువుటయు వినుటయుఁ దటస్థించినదికదా?

# VIII

# అజ్ఞదాతృత్వము

దక్షిణాపథమందు దండక యను యరణ్యంబొక్కండు గలదు. అయ్యది నానామృగగణాకీర్ణం బయి యనేకవిహంగజాలాస్పదంబయి సుందరలతాంతపరిశోభితంబయి యొప్పు. అందు స్ఫటికశిలాసోపాన విరాజత్సరోవరంబున కుత్తరదిశ యందు శుకపికశారికాదిశకుంతముల కాటపట్టయి యొప్పు వటవృక్షశాఖలయం దహర్నిశంబు బకద్వయంబు జలాశయమునంగల మీనముల భక్షించుచుం బవిత్రోదకములం ద్రాగుచుం గాలము గడపుచుండు.

ఒక్కనాఁడు మగకొక్కెర జలాశయమునంగలి మీనరాశిఁగాంచి యచ్చెరువంది, 'చెలీ! ఏమి యీసరోవరంపు రామణీయకంబు? ఎటు సూచిన కన్నుల కింపుగూర్చుచున్న యది. ఎన్నడును గని విని యెఱుంగని యీమత్స్యము లెక్కడి నుండి యరుదెంచె? అంతయు దయార్ద్రహృదయుఁడగు శ్రీమన్నారాయణుని కృపయే! ఆమహాత్ముని కరుణారసప్రవాహమున కడ్డువెట్టువారు గలరా? ఆదివ్యమూర్తి యపారమగు కరుణచేఁగాదె యెల్లలోకములు సుఖముంట? ఆహాహా! చూడు చూడు; కమనీయములగు మత్స్యము లవి గవిగో! సర్వకాల సర్వావస్థలయందు నీ పద్మాకరం బిట్టు లుండినచో నిఁక మనకుఁ గొఱఁతయా?' యని సంతోష ముట్టిపడుచుండ సప్రేమముగఁ బలికెను.

మగకొక్కెర చెప్పిన యర్థంబు సర్వంబు చక్కఁగ గ్రహించి యాఁడుబకంబు, 'నాథా! ఎల్లకాల మిట్లుండుట తటస్థించునా? కాలచక్రము బండిగాలుంబోలె ననవరతముఁ దిరుగుచుండదే? "కష్టసుఖములు కావడికుండ"లనుట వినమా? నవఖండమండలాధిపతియును సత్యమూర్తియు నగు హరిశ్చంద్రుఁడు పెక్కిడుములకు లోనయి గాధినందనువలన తన కొకనీచున కమ్ముడువోయి ముక్కంటికృపాతిశయమున తొల్లింటి భాగ్యభోగ్యములఁబడసినను సుస్థిరముండఁగలిగెనా? ఇంక తుచ్ఛజాతివారిమాట, సెప్పవలయునా?' యని వచించెను.

'చెలీ! నీవచనములు సత్యములు. బ్రదుకుకొలఁది కాలము సుఖముండవలయుగదా? నీవు వచించినటులె సత్యమునకై సర్వస్వమును మునితిలకునకు దానపూర్వకముగ ధారవోసిన యినకులాభరణమగు హరిశ్చంద్రనృపాలుఁడును స్వమాంసమును గపోతమునకై కోసియిచ్చిన శిబియు మనియుండఁజాలనట్లు మనమును నేఁడో రేఁపో "జాతస్య మరణం ధృవ"మ్మను నార్యోక్తి ననుసరించి మృత్యువాతఁ బడకపోము. కనుక దిగులుమాని తిరుగు టుచితము. దిగులుండెపో యద్దానివలనఁ గలుగుఫలితమేమి? వల దని వచియించినంతమాత్రాన విరించివ్రాఁత లూరకపోవునా? తలవ్రాఁతఁ దుడువఁ దరమా?' యని బకోత్తముఁడు వచింపుడు బకి, 'వహ్వా! ఎంత చక్కని హితోపదేశ మొనర్చితిరి? విరించివ్రాఁతలకయివిచారమేల యని వచింతురా? సమస్తంబు

సరఁగున వెచ్చఁబెట్టుకొని సన్న్యాసము నొందఁదగునే? నేఁడు రాజ్యాధికారమున మిన్నుజూచువాఁడు రేఁపు భిక్షాధికారియయి బిచ్చమెత్తుకొంటఁ గానమా? కొలనునిండ మీనము లున్న•వని కులుకరాదు. భవిష్యత్తు నారసినవాఁడె సర్వజ్ఞుఁడు నాఁబడు. కనుక కృపవహించి యీ యాఁడుకూయి నాలించి తగినట్టు వాడుకొంట మహాధర్మము. లేదేని మన మిడుతమలఁ గుడువవలసివచ్చు' నని వాక్రుచ్చెను.

బకద్వయంబు పరిసంగంబొనర్చి భద్రంబున బుడమిని కాలము బుచ్చుచుండెను. దివసములు నిండె. వారము లరిఁగె. పక్షము లతిక్రమించె. మాసములు సనియె. శ్రీమంతంబై ఋతురాజ మనంబడు వసంతఁబు సకలజన సమ్మతంబుగఁ బ్రవేశించె నందు

సీ॥ పరిపక్వసహకారఫలసంపదలతోడ
విమల మృద్వీకగుళుచ్ఛములతోడ
మృదులోల్లసత్కర్కరీఖండములతోడ
లలిమీరు రంభాఫలములతోడ
మిటిమీరు వరదాడిమీఫలంబులతోడ
పొలుపొందు చక్కెరపొళ్ళతోడ
జిలుఁగు తేనియలొల్కు చెఱఁకుతుంటెలతోడ
గప్పుడుల్చిన వడపప్పుతోడ
మల్లికామణిపుష్పదామములతోడఁ
గలితపాటీరచర్చాదికములతోడఁ

జాతిబకమని తలఁపక కరుణింపుఁడు. మిమ్మేఁ గనుట త్రిభువనసామ్రాజ్యాధిపతిఁ గనుటవంటిది. మీర లుత్తమవంశసంజాతులరు. ఆర్యుల పౌత్త్రఖిలసౌఖ్యముల కాలయమండు్రి. విఖ్యాతులరగు మీ రిటఁ బ్రవేశించి భద్రములగు సంతోషబీజముల నాదుమానసాలవాలమున నాటుఁ' డని కరంబు వినయంబునఁ బ్రార్థించు బకునిఁ గని యొకయంచ 'యోయీ! నీవు వచించుస్థలమా చిన్నది; మేమా లెక్కకు మీఱియున్నారము. మే మీ రేయి నిటనుంటిమేని మీర లిడుముల పాలగుదు' రనెను.

భవిష్యజ్జీవనమునకయి పలు తెఱంగులఁ గొందలం బందుచున్న బకి తన పెనిమిటివాక్యసరణిని చక్కఁగ గ్రహించి, 'యయ్యో! యి దెట్టి విపరీతము? ఎన్ని చెప్పిన వినఁడాయెనే? "చేలమున చిచ్చుకట్టుకొన్న" ట్లీ కాలములోనా కొంపఁ ద్రవ్విపెట్టుట? "తనకు లేనిదానము మొదలు చెడ్డబేరముఁ" గలదా? ఈ విపరీతపుదానములు ముందున్నవే? మందువేసఁగిచే మలమలమాడుచు మనియుంట కొక్క మత్స్యమయిన లభింపని యీ రోజులలోనా యతిథుల గారవించుటలు? మన కున్నగడా యితరులకు గుడువఁబెట్టుట' కని తనదుమనమున పెక్కుతెఱఁగులఁ దలపోసి బకముం బిలిచి, 'నాథా! ఏల మీ కీవెట్టి? మొగిలులోపలి నీళ్లనమ్మి చెఱువునీళ్లు సడలించిన వేదురు వలె వచింపఁదగునే? జలాశయము నిర్జలమైయుంట గానమా? లెక్కకుమీఱిన రాయంచల నాహ్వానించిన మనడొక్క

లేద్వా? తొల్లింటి నా విస్మయించు ప్రసంగముల నావలఁ
ద్రోసిపుచ్చితివి. ఇపుడయిన పాలింపఁదగదా? "గోరు
చుట్టుపయి రోఁకటిపో" టన్నట్లశనమునకులేక యాకులిత
మనస్కులమయియున్న మన మిపు డెట్లు సత్కరింతుము?
వివేక మావంతయైనఁ బూనక లేచిపోని బరువుల శిరమునఁ
బూనకుఁడు. నాయెఱిఁగినకొలఁది వచించితి. పక్షుల
పఱువెత్తనిండు. ఇంక ననేకపర్యాయములు గావింప
వచ్చు' నని హితవుసెప్పెను.

ప్రియంబున బకిసెప్పిన హితోపదేశము తెలివిమాలిన
బకమునకు కర్ణకఠోరముగ నుండెను. దుష్టబుద్ధికి ప్రియములు
గిట్టునా? అవివేకికి వ్యక్తత్వముండునా? దానమునకై కొంప
దవ్విపెట్టువారు గలరా?

బకము తనమనమున, 'ని దెట్టిత్రోవ? "పరోప
కారార్థ మిదం శరీర"మందురుగదా! పెక్కువత్సరములు
మనినంతమాత్రాన మేను సుస్థిరమా? ఎవరు స్థిరముండఁ
గల్గిరి? జీవనము క్షణభంగురమే? లోకరక్షాధురంధరుఁడగు
శ్రీరమాపతి మరుగుజ్జువేషమున భైక్షుకుఁడయి యాచింప
సమస్తంబు గురూపదేశంబు వినియు మే నస్థిరమని తలఁచి
త్రిభువనసామ్రాజ్యాధిపత్యము ధారాగ్రహీతమొనర్చిన
బలికీర్తి దానమువలనఁగాదె చిరస్మరణీయమైయుంట? పెక్కు
మాటలేల' యని తలఁచి, 'బకీ! ధర్మమున్నచోట జయ ముం
డకపోదు. "యతోధర్మ స్తతోజయః" యను నార్యులనుడి
వినమా? "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ"

వచ్చును రీతిఁ బురాకృతకర్మ మనుభవింపక తీఱదుగదా! ఏల నీ కీభయము? ఏ పరబ్రహ్మస్వరూపుఁ డేరమాపతి యేకరుణార్ద్రహృదయుఁ డీలోకముల తన యసమానప్రతి భచే సృష్టించి పోషించుచున్నాఁడో యట్టి జగదేకపావ నుఁడు జగన్నాథుఁడు లోకబాంధవుఁడు మనకడ్డు రాఁడా? రాఁడుపో చత్తుమా? పస్తుండి పరలోకమున కేగినవారు లేరు గదా? చల మూని కాలముగడఁపునది' యని దీనవదనలై యున్న తనచెలికిం జెప్పి యంచలఁగలిసికొని, 'మిత్రములారా! అల్లదిగో యనతిదూరమునఁ గన్పించెడి వటవృక్షము మద్గృ హంబు. మీరెల్లరు గరుణావహించి యటకేతెంచి మజ్జన్మంబు సాఫల్యపాత్రంబు సేయుఁ' డని ప్రార్థించి ముందుగ గీము సొచ్చెను.

ఎంతసెప్పినను తనమాట వినక త్రోసిపుచ్చిన బకము తోఁ గాలముజరుపనొల్లక బకి యెందేనిం జనెను. కష్టసుఖ ములఁ దలపోయక భామినులమాటఁ ద్రోసిపుచ్చవచ్చునా? గృహస్థాశ్రమమున కలంకారము కలకంఠకంఠి కాదా? భర్తకు భూమండలంబుఁ బాలించుఱేని కమాత్యుండువోలె భార్య యొకదా యాలోచనలఁజెప్పి సంసారకృత్యముల నిర్వహింపఁ జేయునది?

ఆగర్భదరిద్రులయి యన్నమోరామచంద్రా! యని యెలుఁగెత్తి యేడ్చుచున్న పసిగందులఁ గని కడుపుచిచ్చు భరియింపంజాలక ధరణీసురేంద్రోత్తముఁడగు కుచేలున కుపా

యంబు గఱచి యతులితభాగ్యములచేఁ దులఁదూఁగున ట్లొనర్చినది యువతీతిలకముగాదా?

కలహభోజనుని కార్చిచ్చుఁబోనడఁచి యుక్కుగుగ్గళ్ల మక్కువంబున వండి ప్రఖ్యాతివడసిన పతివ్రతాశిరోమణి యగు ననసూయ స్త్రీరత్నమెకదా?

సత్యమును బరీక్షింపనెంచి గాధినందనుఁడు పెట్టు కష్టపరంపరల కావంతయయిన గొందలంబుగొనక భర్తృపదకమలముల ననవరతము వీడక తుద కొకబాపని కమ్ముడువోయి పెక్కుడుములఁ గుడుచుచు నిజసూను బ్రేతభూమిలో గోల్పోయి తనదుమాంగల్యప్రభావముతో శ్మశానవాటికఁగాయుచున్న భర్త నెఱింగి యుమామహేశ్వరుల కరుణాకటాక్షమున లోహితునిఁ బ్రదికించుకొని సంపూర్ణైశ్వర్యాభివృద్ధితోఁ గరంబు శుభంబునఁ బతితోడఁ గాలముఁ గడపిన మహిళాలలామ చంద్రమతి యనంబరఁగు మృగేక్షణయెకదా?

అహితాపహృతరాజ్యుఁడును విగతచక్షుఁడు నగు సాళ్వదేశాధీశుని లబ్ధచక్షువుగను బునః సంప్రాప్తరాజ్యునిగనుంజేసి వంశపరంపరాభివృద్ధియగునట్లు తనతండ్రికి సుతశతలాభంబు సేకూర్చి తనభర్తప్రాణముల సంపాదించి యాతనివలన నూఱుఁగురు కొడుకులఁగన్న యవ్యాజాను రాగిణి యగు సావిత్రి స్త్రీలలామకాదా?

ఎట్టి బుద్ధిశాలియయినను నితరులు సెప్పినప్పుడు వినఁదగుఁగదా! తనకుహితవు సెప్పినబకివాక్యములు తృణీకృతయోగ్యములా? చెవిటివానికడశంఖమూదినట్లు మూర్ఖునికడ మంచిగిట్టునా? బకముచే నాహ్వానింపఁబడిన రాయంచలన్నియు మక్కువతోడ మత్స్యముల మెక్కి సుఖనిద్రవోయి వేఁకువ మేల్కాంచి, 'బకోత్తమా! విందన నీయదియెసుమీ! పలుచోట్ల విహరించితిమిగాని యిట్టిపవిత్రమగుఁ గన్పట్టిన సరోవరంబునుగాని శకుంతముల కునికిపట్టగు వటవృక్షంబుగాని చూచి యెఱుఁగము. ఎన్నియో జంతుసంతానము లున్నవి. వన్నెకును వాసికిని రానివేల? భగవంతుఁ డనుగ్రహించినదాని నితరులకు ధారవోయుట కేకొద్దిబుద్ధిమంతులకో మన పొప్పుట. మా కెల్లర కింపుమీఱ గడుసొంపుగ విందొనర్చిన నీనామంబు చిరస్మరణీయ మనంజెల్లు. ఇఁక పోయివచ్చెదము. సెలవి' మ్మని చెప్పి వటవృక్షంబు వీడి తివ్వన నంబరము నలంకరించెను.

రాయంచలు కొలకునంగల మీనంబులనెల్లఁ గుడుచుటచే మఱునాఁ డుదయమున లెక్కకైన నొక్కమీనము గానరాదయ్యె. ఆఁడుబకంబు సెప్పిన హితమితోక్తులఁ దృణప్రాయముగఁ జూచినందులకు శిక్షించుటకో యన్నట్లు పద్మబాంధవుఁడు ప్రచండుఁడయి తన వేయికిరణముల నొక్కతూరి పద్మాకరముపయిఁ బ్రజ్వరిల్లఁజేసి నీరముల నింకింపఁజేసెను. తినుట కశనమును ద్రాఁగుటకు నీరును లేమింజేసి కులకాంత విన్నపంబు స్వాంతంబునం దలంచుచు శక్తికి

మీఱిన వితరణంబున నిటుల కడగండ్లపాలయితి గదా యని చింతించుచు నెటో కాలక్షేపము సేయఁదొడంగెను.

ఓ విద్యార్థీ! వింటివి కదా యతివితరణంబునం గలుగు విపత్పరంపరాసమవాయము! కాన యథాశక్తి సర్వకృత్యంబులఁ గృతార్థుండగుట నీమనఃపద్మంబున సర్వోత్తమ మను యంశమును విస్మరింపకుందువుగాక!



# IX

# సూనృతప్రభావము.

తొల్లి మగధదేశమున నసామాన్యప్రతిభాశాలియు సకలసద్గుణగరిష్ఠుఁడు నగు శంబరుఁ డను రాజతిలకుఁడు సర్వజనానురంజకముగ నిక్ష్వాకుకులతిలకుఁడగు శ్రీరామచంద్రుఁ బోలెఁ జక్కనిపరిపాలన మొనర్చుచుం డెను. ఆ నృపశేఖరుఁడు సమస్తభాగ్యభోగ్యములఁ గలిగియున్నను సంతానంబులేమి నెల్లయు వ్యర్థములని తలపోసి తన పురోహితోపదేశమున నగ్నిహోత్రుఁగూర్చి పెక్కేఁడు లతిఘోరతపంబు నొనర్చి యా పావకుకరుణాతిశయమున ద్రుపదరాజుపగిఁదిఁ దేజోమూర్తియగు పుత్రుని నధికస్వరూపిణియగు కూఁతుం బడసి నా యిరువురకుఁ గ్రమంబునఁ బావకలోముఁడును మదనరేఖయు నను నభిధానము లొనర్చి కడుం గడు కూర్మినఁ బెనుచుచుండు.

పాలవెల్లియం దుద్భవించిన చంద్రునివలె లక్ష్మీలీలన య్యిరువురును దినదినప్రవర్ధమానులయి తండ్రినియోగమున గురువులకడ విద్యల నభ్యసించుచుండిరి. అందు మదనరేఖ గురువున కమితభక్తి వినయవిధేయతలు సూపుచు కావ్యనాటకాలంకారములఁ జదివి చతురంగము కవిత్వము వ్రాఁత చదువు గణితము సంగీతము యుక్తిచెప్పుట వ్యస్తాక్షరి యనఁబడు నష్టావధానముల మేటరియయి విద్యఁజెప్పిన

యొజ్జలకును గనిపెంచిన తలిదండ్రులకును వెన్నంటి తిరిగెడు నెచ్చెలిపిండునకును సర్వవిధముల సంతోష మొనఁగూర్చుచుండెను.

ఒక్కనాఁడు గురుపుత్త్రుఁ డంగీరుఁ డనువాఁ డా కన్యామణి రూపసౌందర్యాతిశయమునకుఁ గడు హెచ్చుగ మెచ్చి యంగజుఁడు పేడపురుగువలెఁ దన డెందమున వసియించి తొలుచుచుండఁ ద న్నంటియున్న శిష్యబృందమును దమతమ నివాసస్థానముల కనిచి యాతఁ డా సరోజముఖిని నేకాంత మందిరంబునఁ గదియఁబోవ నావిద్యావతియత్యాశ్చర్యరసనిమగ్నయయి, 'గురునందనా ! ఇదితగునే? చతు ...బల నెంతయుఁ జక్కగఁబఠించి యంబుజహాగర్భ ...ఱుఁడ వని పేరెన్నికఁగన్న నీవుస్త్రీలోలత ద్యూతము ...నము వేఁటాడుట పరుషసంభాషణము సొమ్మువ్యర్థ వ్యయముసేయుట పరులనిందించుట యనెడు సప్తవ్య ...యం దన్యస్త్రీలఁ జేపట్టనెంచుట మహాపాతకహేతు ...ఱుఁగవే? స్త్రీలోలత్వమునఁ గాదె దశముఖుఁడు శ్రీ ...సెను, బురుహూతుఁడు గౌతమునివలననుగ్రమంబున ...ందుటయు,నందవికారుఁడగుటయుఁ దటస్థించుట? ఉ... ...తుఁడవగు నీ విట్లు కోరఁదగునా? కన్నియ పితృ ...ని తెలియవా? యువతికిఁగన్యాత్వము సెడిన దాని ... వృథాపోదా? వాడిన పువ్వులు మఱల ముడుచునే? ...న స్వదియనెంచుట నీకుఁ బాడియే?' యని పలికెడు ...వతి కావిప్రనందనుఁ డెదురువలుకనేరక కాలిబొటన

వేళ్లు భూమిపయి వ్రాయుచు మన్మథోద్రేకమున నెల్ల విద్యలు మఱచి మూఢునిభంగి యాపెకొంగుపట్టి కోర్కెఁ దీర్పు మని కోర నాపడఁతి కోపావేశమునఁ దనయుత్తరీయము నాయున్మత్తుని హస్తమునుండి గుంజుకొని నోటికివచ్చినట్లెల్లఁ దూలనాడ మొదలంట నఱుకఁబడిన కదళీస్తంభము లీల నాబాలుఁ డుర్విపయిం వ్రాలి మూర్ఛనొందెను.

మాటలేక మూర్ఛవోయియున్న బ్రాహ్మణునిశరీరము నాకన్నియ నిజాంకస్థలమున నిడికొని, 'గురునందనా! నాకై గదా నీ వసువులు పాయనుంట! సర్వశాస్త్రవేత్తనయి సకలసద్గుణగరిష్ఠుఁడ వని పేరెన్నికఁ గని యొక్కహేయమగు కన్యకా నీసుందరాకారము భస్మమొనర్చుట ? నీజనకునొద్ద విద్దెల నభ్యసించి నీయసువుల వాపుటయా యే నొసఁగు గురుదక్షిణ ? నామూలమున నీవు మడియుదువు. నీవు చనిన నీజననీజనకు లుండరు. భార్య నిలువదు. పుత్రులు బ్రదుకరు. ఒక్కశరీరి యింతమంది చావున కియ్యకొనఁదగునే ? కూడదు కూడదు. "బ్రాహ్మణో నహంతవ్య" యండ్రు గదా! ఇట్లిందఱఁ జంపి పంచమహాపాతకంబుల నెక్కుడు దాని నే ననుభవింపనేల? ప్రపంచమునం దితని కే పుట్టినాయిట్టి భ్రాంతి!' యని తనమనమునఁ దలపోసి 'నే ననవరతము నిజము వచించెదు దానినేని గురునందనుఁడు మూర్ఛనుండి లేచు గాఁత!' మని పలికి గురుతనయునొడలిపయిఁ దన మృదుకరంబునఁ దడవఁ జంద్రునిఁగన్న చకోరముపక్కి నయనోత్సవమున లేచి యా యిందువదనతోడ, 'చెలియా! మనోరథముఁ

దీర్పవా? నన్నేల మన్మథకీలలఁ గాల్చెదవు? నీ సుందరాకారమును పీడి మనియుండఁజాల' నని వచింపుచు నాచకోరనయనపదపద్మముల వ్రాలబోవ నాపుష్పగంధి యాతని లేవఁదీసి కూర్చుండఁబెట్టి, 'గురుపుత్రా! నే నొక్క ధర్మవు సెప్పెద నాలింపు. నేనిం గవిసిన నాకన్యాత్వము సెడు; నద్దాన నన్నన్యపురుషుఁ డొల్లఁడు; దాన నాకిహాపరముల ననంత దుఃఖము వాటిల్లు. పతిలేనిసతికి గతులు లేవందురుగదా! నే నతిత్వరితగతి మద్గృహంబున కేగి యుత్తమరాకుమారు నొక్కని బరిణయంబాడి వానితోడఁ జిత్తజకేళిం దేలకమున్న నీ వున్నతావున కేతెంచి యుష్మన్మనోరథము దీర్చి వెడలెద. నా కనుమతీయవే!' యని వినయవిధేయత లుట్టిపడఁ బ్రార్థించెను.

ఆబ్రాహ్మణోత్తముఁడు తనశిష్యురాలితో 'సయ్యో! ఇదేటివింత? అగ్నిసాక్షిగఁ బరిణయమాడు క్షత్రియుఁడు నిన్ను నాకడ కెట్లంపు? నీ వేరీతిగ గృహముపీడి యెల్లధర్మములు వమ్మొనేసి వచ్చెదవు? నేఁ డున్నబుద్ధి ఱేపుండునా? "బండ్లోడలగు నోడలు బండ్లగు" నిట యెవరు సుస్థిరబుద్ధితో నుండగలరు? "చేతివాని విడఁచి కాలివానిఁ బట్టుకున్న" ట్లు దగ్గఱనున్న నిన్ను నేఁడు వదలనేల? మఱల నెన్నఁడో యాసింపనేల? తొల్లి యొకమునిశ్రేష్ఠుఁడు మనుష్యజన్మము పీడి సూకరాకారమున సంచరించుటఁ కియ్యకొంటఁ దెలియవా? విను మద్దానిఁ దెల్పెదు. గంగానదీప్రాంతారణ్యమున శిష్టుఁ డను భూసురోత్తముఁ డొక్కం డుక్కుమిగిలి తపమాచరింపుచు నొ

క్కనాఁడమితనిష్ఠతోఁడ గంగాసైకతస్థలమున పద్మాసనాసీనుఁ డయిలోకపరంధాముఁడగు శ్రీమన్మహావిష్ణుంగూర్చి ధ్యానింపు చుండ నదీజలముల గుడ్డల నుతికెడు నొక్కచాకిత వానిం గాంచి పంచబాణుఁ డా యంగనను బీల్చిపిప్పిఁజేయుచుండ నేకార్య మును సేయనోపక తన మనోరథమును నెరవేర్పు మని యా తనిం బ్రార్థింప నాబుషిసత్తముఁ డెన్నెన్నియోరీతుల నా లేమ కన్యపురుషులపొత్తిహపరములకు దూర మని నీతిగఱఁ పినను నయ్యాది వినిపించుకొనక తన్నతఁడు గవియనిచోఁ బ్రాణములఁ గోల్పోవుదు నని వచియించి యట్లొనర్ప సం సిద్ధముగనున్నతఱి మునిపుంగవుఁ డయ్యాది మృతినొందు నని యెంచి దానిమనోరథముఁదీర్చి పాపముగట్టుకొనెను. అంత నతఁడు తనశిష్యునకుఁ దా నొనర్చిన పాపకార్యమును జెప్పి తా నొకసూకరమై తత్సమీపనివాసి యగు బూసిగాఁ డను నెఱుకలవానిపందిగర్భమునఁ బుట్టఁగలననియు నట్లుద్భవింపఁ గనే తన్ను మడియింపు మనియుఁ జెప్పి సూకరమై పుట్ట నతని శిష్యుఁడు కోమలముగనున్న యాపిల్లను బొలియింపమనసొప్ప మి నయ్యాది నాళ్లుగడచుటచే నొకింత యొడలు పెంచి ము కుందుని ధ్యానించుచుండెను.

సకలలక్షణలక్షితుండును సర్వజనపోషకుండును సర్వ జ్ఞుండును నగు హరి బోయవానిరూపమును ధరియించి వరాహ రూపముననున్న బాపనిగుణగతములఁ దెలియ నెంచి యొక్క బల్లెముంబూని కొండపక్క సంచరింపుచున్న యద్దానిం బొడువ నెంచి సూకరమును డాసి దాని కిష్టమగు దైవమును

ప్రార్థింపు మనవుడు నావరాహకిశోరము కృపారసపూర్ణుం డును దుఃఖవిమోచకుఁడును బయోధరవర్ణుఁడును మోక్ష కారణుఁడును నగు రమాపతియె తనకు దిక్కని వేఁడ నాసురే శ్వరేశ్వరుండు నిజరూపమునఁ బ్రత్యక్షమయి యాసూకర మును బ్రాహ్మణోత్తముగా నొనర్చి సుఖంబున మని యం త్యమున వైకుంఠమున కేతెంచున దని వచియించి వెడలెను. ఓకురంగేక్షణా! సమస్తవిద్యల నారితేరిన భూసురాభరణము కీటరూపమున కియ్యకొం టెట్లో నీవును మఱల నీప్రాణనాథు వదలి నాకడ కేతెంచుటయు నట్లే! పెక్కుమాటలేల? ననుఁ బ్రతికింపఁదలఁచితేని ననుఁగూడు; మదియుఁగాక స్త్రీలమాట లెవ రెఱుఁగుదురు? వస్త్రధారను నక్షత్రములను భూరేణువుల నైన గణింపఁదరమగుఁగాని పొలఁతులమనంబు దెలియఁ దరమా?' యని పలికెను.

గురుసుతుఁ డాడినవాక్కులు చెవులకు ములుకులుగఁ దోఁప నాసౌందర్యరాశి 'యోబ్రాహ్మణోత్తమా! సకల విద్యలఁ జదివినదాని సత్యవాక్యపరిభావము నెఱుఁగనా?

క॥ శతకూపాధిక దీర్ఘిక;
శతవాప్యధికంబు గ్రతువు; శతయజ్ఞసము
న్నతుఁ డొక్కసుతుఁడు; దత్సుత
శతకంబున కెక్కు డొక్క సత్యోక్తి; నృపా!

యను మద్గృహంబున కేతెంచి నీకడకు రాకున్నచో సర్వ విద్యలఁ జదివి సత్ప్రవర్తనుఁడని నుతికెక్కిన బ్రాహ్మణోత్తముఁ డుత్తమకన్యను బరిణయమాడ నెంచినపు డావివాహమును

సెఱుఁపఁ దలఁపెట్టినవాఁ డేపాపమునకు గురి యగునో నేను నట్టి పాపఫలము ననుభవించెద' నని చెప్పి వాని నొప్పించి సెలవు గైకొని తనయింటికిఁ జనెను.

శంబరుఁడు సకలవిద్యాపారంగతురాలును ననన్య రూపలావణ్యవతియును నగు నప్పల్లవపాణి ననుపమతేజో విశేషవిరాజితుం డగు కోసలదేశాధీశుతనయుఁడు తంత్రి యను రాకుమారున కిచ్చి శుభముహూర్తమునం బరిణయము సేయ నాదంపతులు విప్రజనములఁ దాంబూలాది వివిధ సత్కారంబులఁ బరితృప్తులఁ గావించి తదాశీర్వచననిచయ ములు వడసియున్నతఱి నుభయపక్షములబంధువులు వస్త్ర వాహనాదుల నిచ్చిరి. అంత నెల్లరకు షడ్రసోపేతమగు నన్నంబును గర్పూరతాంబూలాదుల నొసఁగి మృష్టాన్న సంతృప్తులుగ నొనర్చిరి.

ఏడువారముల యాభరణముల నా పూఁబోఁడినిం జెలి కత్తెలు శృంగారించి యత్తరు పన్నీరు సంపెంగ కస్తూరి పచ్చ కర్పూరము మున్నగు సువాసనద్రవ్యము లెన్నెన్నియో సేకూర్చి సర్వమంగళద్రవ్యవిభ్రాజమానమగు శయ్యా గృహమున కంపిరి. ఆ యోషామణి తన భర్తకు మున్ను గురుపుత్రుతోఁడఁ దా నన్న వాక్యమును జెప్పుటకు నోరాడక యొకప్రక్క నొదిగియుండి తనమనమున, 'దైవమా! ఎట్టి దుర్ఘటావస్థ తటస్థించె? అగ్నిసాక్షిగఁ బరిణయమాడిన పతికోర్కియా తీర్పక తప్పదు. కన్యగా నుండుతఱి నే గురు పుత్రుతోఁడఁ గావించిన శపథమా దొడ్డది. "ముందు బావి

వెనుక గొయ్యి" యనెడుచందమున నున్నది. పతి కేమని
నా యుద్దేశ మెఱుఁకపఱతు? ఎఱుఁక పఱచ కే నొనర్పఁ
దగిన కార్యమెద్ది? తెలియపఱచిన నియ్యకొనునా? ఎట్టి
కష్టుఁడైనను దుంటరియైనను విద్యావిహీనుఁడైనను దా నగ్ని
సాక్షిగఁ బరిణయమాడిన యువతీరత్నము నొరులకుఁ గట్టి
పెట్టనెంచునా? అయ్యో! సమ్మతించఁ డని యూరకున్న నా
విప్రవాక్య మనివార్యముకదా?' యని ఘనంబుగఁ దలంచి
యే వాక్యము నుచ్చరింపుటకును దోఁపక ముగ్ధత్వ ముట్టిపడు
చుండఁ బక్కదిగి విన్నపము సేయనలయు నని కొంతసేపును
న ట్లొనర్చిన నతఁ డంగీకరించునో యంగీకరింపఁడో యని
కొండొకతడవును దలపోసి యెట్టకేలకు పాన్పుదిగ నుద్యుక్త
రాలయిన యామదిరాక్షి నాతంత్రిభూపాలుఁడు వీక్షించి
డగ్గఱకుఁ జేరి, 'యో మనోనాయకీ! నా భాగ్యంపురాశీ!! నా
యర్ధాంగలక్ష్మీ!!! ఏ నీ కొనర్చిన దోసమెద్ది? నీ యలుకకు
గారణ మెనరు? అశ్వములు నీయవి. ఏనుఁగులు నీసొత్తు. అరద
ములు నీసొమ్ము. కాల్బలము నీయధీనము. సమస్తమహీచక్ర
మంతయు నీపా లొనర్చితి. ఏ నీవాఁడ. ఇంక నీయది కాని
దెయ్యది? తుచ్ఛులు నీమానసమును దొంగిలింప నెంచిరా?
నెచ్చెలులు తిరస్కరించిరా? పరులు నవ్విరా? నీ కెవఁ డపకార
మొనర్ప నెంచెనో వానినామ ముచ్చరింపు, ముత్తరక్షణంబ
వాని మత్కరవాలమున కెరఁజేసెద. ఓభాగ్యశాలినీ! భార్యా
భర్త లిరువురు సంసారమనెడు రథము నడుప నశ్వము లందురు

గదా? నను నీవు గ్రొత్తగఁ బరిగణింపకు. నీసందియముఁ దెలుపు' మని బ్రతిమాలెను.

భర్తపలుకుల కెంతయుఁ దన డెందమున నా స్త్రీరత్నము సంతసమందుచు నానంద బాష్పములతోఁ గరకమలములు మొగిడ్చి వినయమునఁ దొల్లి కన్యగానుండి తా నడవి కేగుటయు గురుపుత్త్రుఁడు తనరూపాతిశయమున కచ్చెరువంది తనఁ గదియ వచ్చుటయుఁ దనదగు సరోషప్రతిభాషణంబును నంత నాతఁడు కదళీస్తంభములీల భూమిపయిం గూలుటయు బ్రహ్మహత్య పొడమె నని తత్సమయసముచితవచనంబుల నుపచరించిన నీశ్వరానుగ్రహమున నాభూసురుఁడు చైతన్యంబునొంది తన్ను చెట్టఁ బట్టఁబోవుటయు వానిచిత్తంబుమార్చు నుపాయంబుఁ గానక తా నొక్క రాజపురుషుఁ జేపట్టి వానికోర్కెఁ దీర్చెద ననియుఁ దానొనర్చినసమయముంగూర్చి చెప్పి, 'మనోనాయకా! కరుణించి విప్రమనోరథంబుఁ దీర్ప నన్నంపుము. లేకున్న నసత్యదోషంబునఁ జండాలురమై పుట్టుదుము. భార్యచేసిన పాప భర్తకుం జెందు. భార్యాపాపంబున భర్తసగఁ బాలనుభవించును. భర్తచేసినదుష్కృతముందప్పు సుకృతము సగఁ బాలు స్త్రీపంచుకొనునని వచింతురు. ననుఁగూర్చి దుష్కృతమీవేల ననుభవింపవలయు నని మున్ముందుగ దేవర కెఱిఁగించితి.

తే॥ రాష్ట్రమునసైన పాపంబు రాజుఁ బొందు
క్షితిపుపాపంబు మఱి పురోహితునిఁ బొందు
మగువచేసిన పాపంబు మగనిఁ బొందు
శిష్యుపాపంబు గురుఁ బొందు సృష్టియందు.

సని చెప్పుట వినవా?' యని సవినయముగఁ బలికెను.

భార్య చెప్పిన యుదంత మారాజపుత్రున కెంతయు మనోవేదనఁ గలిగించెను. ఏ సుందరాంగింగూడి చిత్తజకేళిం దేలి సుఖముగఁ గాలముగడఁపనెంచెనో యట్టిదాని నన్య పురుషుపాల్సేసి తర్వాత తా ననుభవించుట కేవానిమనసు తత్తఱపడదు ? వీతిహోత్రుముందుఁ బరిణయమాడిన సతీ మణి నన్యపురుషుకడ కంపుటయా? దేవతుల్యుఁ డగు భూసు రోత్తముని మన్మథకేలల మసిచేయుటయా? భార్యను కల్లలాడు దానిగ నొనర్చుటయా? యను నవి వానిబాధింపఁ దొడఁగెను. అతఁడు తనడెందమున, 'నన్నా! ఆఁడువారి కాఱుగుణము లధికమండ్రుగదా ? స్త్రీలగుణముల వర్ణింప నాచతుర్ముఖుఁడు నేరఁడు. సహస్రాక్షుఁడును దెలియలేఁడు. వారు లేకార్యము సయినఁ జేయసమర్థులు. వారలు సద్గుణోపేతులయి సంసార మును నడపింప వలంతులు. సృష్టికర్త యగు బ్రహ్మయుఁ బోషణకర్తయగు విష్ణువును లయకర్తయగు శంభుండు నొక్క స్త్రీచేఁ గాదె యద్వితీయ మగు ప్రతిభనలన సృష్టింపఁబడుట? అయ్యో! ఏయుపాయము దోపకున్నదే! తోపకున్న నిట కె న రేతెంచి నా కుదోబ్ధ నేతును ? నేసిన నే న్నెట్లు సమ్మతింతు? కాదు కా దే నొనర్పఁదగిన దిఁక రెద్ది?' యని డోలాయమాన మానసుండయి తలపోయుచున్న పతి నాపతివ్రత తిలకించి, 'నాథా! పెక్కుగతులఁ జింతింపనేల? ప్రపంచమున సత్య మును మించిన దెద్దియును లేదు. సత్యవాక్యపరిపాలనార్థము తొల్లి శిబిచక్రవర్తి తనమేనికండలు కోసియిచ్చి చిరకీర్తి

నాజ్ఞింపఁడే? బలిచక్రవర్తి, మరుగుజ్జువేసమున మూఁడడుగుల మేర నడిఁగి భూమ్యాకాశములును దానమై పదునాల్గులోకములఁ బ్రకాశింపఁజేసెడు మేనుతో శ్రీమన్మహావిష్ణుండు తన్నధోలోకమునకుఁ ద్రొక్కినను, నెదురాడకుంట యసత్యమునకు వెఱచికాదె? త్రిశంకునందనుఁడు గాధినందను తపోమాయచే ననఖండమండలాధిపత్యమును గోల్పోయి కారడవులఁ గందమూలములఁ దిని కాశి కేగి కులసతి నొక్క బాపని కమ్మి తా నొక నీచాతినీచున కమ్ముడువోయి సేవకత్వము సేయుట సత్యమున కేగదా? సత్యమును నిలుపఁగలందుల కే కదా దశరథుఁడు సకలసద్గుణధాముఁడగు శ్రీరాము నరణ్యమున కంపుట? అసత్యమునకుఁ గడుంగడు వెఱచియేకాదె ధర్మజభీమార్జుననకులసహదేవులు ద్రోవదింగూడి పండ్రెండేఁడు లరణ్యవాసమును నొక్కయే డజ్ఞాతవాసమును సేయుట? ప్రాణేశా! సమస్తముఁ దెలిసినతమ కేలాటిసందేహము గల్గె? దేవర యూహించినఁ దెలియరానిదున్నదా? ఎన్నియిక్కట్టులొదవినను సమస్తభాగ్యభోగ్యములు వోయినను భార్యాపిల్లలు దూరమైనను సత్యవ్రతమును విడనాడఁ జనదు. మఱియు నోమనోనాయకా! స్త్రీలు సద్గుణులయి తమపతుల మెప్పించుటయుఁ బతులు సతులఁ జక్కఁగ గారవించుటయు ధర్మము. అతివలన్యమార్గముల నడువఁదలంచిన నెవ్వరికిని వారిహృదయంబు లెఱుంగరావు. ఏ మహిళారత్నము లనవరతముఁ దమభర్తలె దైవము లని యెంచి పతిసేవ సేయుచుందురో వార లుత్తమలోకనివాసు లగుదురు. పెనిమిటులఁ దిట్టుచుఁ

ఖండ్లు గొఱకుచు నెప్పుడు నేదియో గొణఁగుచుఁ బరిక్క
యింటివారికి బలుసుముల్లయి యసత్యదేవత యని పేర్వడసి
తలముడువక బొట్టుఁబెట్టక పెద్దల గౌరవింపక పాకశుద్ధిలేక
వాకిటికడ కేతెంచినవారినెల్ల మెడబట్టిగెంటుచు నేత్రము
లెఱ్ఱసేసి యతిథిపూజ యనినఁ గలనైన నెఱుఁగక కలహ
కంఠినివలెఁ బరివర్తిల్లు దుర్మార్గురాలు రెండులోకములఁ
దూలనాడఁబడి భర్తతోడ సమసుఖదుఃఖభాగిని యగు.
కనుక వెడలి రమ్మనిన నే నా భూసురోత్తము కోర్కెఁ దీర్చి
వచ్చెద' నని మృదుమధురముగఁ బలుక నా తంత్రిభూ
పాలుఁ డామె సత్యసంధత్వమునకు మెచ్చి 'భూదేవోత్తము
గలిసి శుభంబున మగుడు' మని దీవించి యంపెను.

భర్తృననుజ్ఞఁగొని విప్రుకొఱకయి యర్ధరాత్రమున
వెడలుచున్న సీమంతినీతిలకమును సప్తతాళపరిమితదీర్ఘ
దేహుండును దిగ్గజశుండాయమానహస్తుండును శూలస్పర్ధి
రదనావళీవిరాజితుండును నగు రక్కసుండొక్కండు డుక్క
మిగిలి గర్జానుకారికంఠరవంబు బిట్టుసేయుచుఁ గటికిచీఁకటిఁ
దృణీకరించు మేనునైగనిగ్యంబు దిక్కులొలయ భయం
కరాకారుండై నాయువతీమణిం జెట్టఁబట్ట దగ్గఱకేగ
నా సాధ్వీమణి, 'యన్నా! నీ కిది తగునే? సర్వమహీ
చక్రమునకుఁ బ్రభుఁడగు శంబరభూపాలునకుఁ దనయునై
విలువిద్యాపారంగతుఁ డగు పావకలోమునకుఁ జెలియలినై
సర్వసద్గుణధాముఁ డగు సంబిరునకు ముద్దుకోడలినై
కోసలదేశాధీశ్వరుం డగు తంత్రిరాజన్యున కనయము మేలు

గూర్చునిల్లాలినై యెల్లప్రజలఁ గన్నబిడ్డలవలెఁ జూచెడి న
న్నీవు డగ్గఱుట పాపహేతువుకాదె? మాతృపంచకంబున
జేనిభార్యయు నొకర్తె యని తెలియవా? నిశాటాధీశ్వరా!
సత్యవాక్యపరిపాలనార్థమయి కన్నియగా నున్నపుడేను గురు
నందనునితోఁ ముచ్చటించినచొప్పున వానిమనోరథంబుఁ
దీఱుపమన్నాథుననుజ్ఞఁగొని వెడలుచున్నదాన. ఆలసించినఁ
బతి కోపించు. అసత్య మాపాదించు. కనికరమూని నన్నడ్డు
పెట్టక పోనిమ్మని బ్రతిమాలెను.

ఆవాక్యములా పాపపురక్కసుఁడు విని యాలలనతోఁ
'బూఁబోఁడీ! నీవు శంబరుకూఁతువైనను మఱియేరివైనను
"గప్పను సర్పంబు మ్రింగునట్లు" గప్పని మ్రింగకమాన.
ముక్కంటివచ్చినరానీ; మురారియే తెంచిన నేతెంచనీ; అబ్జా
సనుఁడువిచ్చేసిన విచ్చేయనీ; నీవుమాత్రమునావలలనుండితప్పిం
చుకొనిపోఁజాల' వని పలుకుచున్న యారక్కసున కామచ్చె
కంటి సదరు బెదరులేక 'రాత్రించరాధిపా! నీవుదరాగ్నిచే
బాధపడుచున్నట్లే గ్రహించితి. ప్రతిజీవియుఁ "బరోపకారార్థ
మిదం శరీర"మ్మనెడు ధర్మముననుసరించి యితరుల కుపకార
మొనర్పఁదగు. క్షుద్బాధాపీడితుఁడు కృత్యాకృత్యముల
నారయఁజాలఁడద్దాన నీవు నాసుగుణముల నెఱుఁగఁజాలక
"మేకపోతు గాంభీర్యములఁ" బలుకుచున్నాఁడవు. వింటివి
కదా నా దేహ మొకని కమ్ముడు వోయిన దని. నే నతని
కోర్కెఁ దీర్చి మఱల నిటకేతెంచి నాకాయము నీ కాహు
తిఁజేసెద. రాత్రించరా! నే నా బ్రాహ్మణపుత్రుకోర్కె

నెఱవేర్పకమున్న నన్నీవు భక్షించినచో పాపహేతువైన నాబొంకివలన నీకుం బాప మాపాదించుఁ గనుక నాయందుఁ గృపవహించి యనుజ్ఞ నొసఁగితేని భూసురురుణముఁ దీర్చి సత్వరగతి నీకడ కేతెంచెద నన్ననుగ్రహింపు' మని వేఁడెను.

రాక్షసుఁ డాయంగనఁజూచి నిర్దయస్వాంతమునఁ 'బద్మగంధీ! ఇట్టి బొంకులు నాకడనేనా చెల్లుట! "హనుమంతుని ముందరనా కుప్పిగంతులు!" చాలు చాలు నిను భక్షింపక నే నెట్లు విడఁతు? ఆఁకలిబాధచే మలమలమాడుచున్న నా ప్రాణము లీవు చిత్తజకేళిం దేలుచు భూసురుతోఁ బొద్దులు వుచ్చి వచ్చువఱకు కుండునా? "జీవనంబు తృణప్రాయ"మన వినవా? తమ రితరులతో నన్నట్లు సేయువారును సప్పనకుఁ గొన్నదానిఁ ద్వరితముగఁ దీఱుచువారును మేలుకార్యము లొనర్చువారును నేయల్పసంఖ్యాకులో రత్నాకరమునం దే మూలనో డాఁగియున్న రతనములభాతిభూలోకమునఁ గలరు. అట్టిచో బొంకులకు గనులగు భామినులలో నొక్కతెవీవు సూనృతవ్రతనిరతురాల వగుదువా?' యనవుడు నప్పరమ సాధ్వి యించుకంతయుఁ గోపమూనక, 'రాక్షసోత్తమా! ఉదరవహ్నిచేఁ దపించు నీయాఁకలిఁ ద్వరితకాలములో బ్రాహ్మణునికడ కేగి వచ్చి తీర్చెద. నామాట నాలింపు మట్లే మగిడిరానేని భూమ్యాకాశములు నన్నప్పళించివేయు గాక. మన్నాథుఁడు ధర్మపాలనాతత్పరుఁడేని నే ననవరతము నెల్లరకు మేలుసేయఁదలఁపెట్టుదునేని నీయుదరాగ్నిఁ

దీర్త గాక ! ఇంకనయిన ననుజ్ఞ నీయవే' యని మఱల ప్రార్థింప నతఁ డాకెతో, 'నాడ తెలుఁగక నిద్రించెడువానిపయిఁ బడి పొడిచివేయుపాపాత్ముఁడేలోకమున కేగునో నీవును రాకున్న నట్లు యని శపథమునొప్పించి త్వరితముగ వెళ్ళి మగిడిర' మ్మని చెప్పెను.

సత్యవాక్యపరిపాలకురాలగు నామదనరేఖ మృత్యు వాతనుండి వెలువడిన ప్రవిభాతి నపరిమితానందమున మునిఁగి తేలుచు గురునందనుగృహమున కరిఁగి యాతఁ డొంటరిగ నుంటఁ దెలిసి సమీపించి తనమనము నెఱవేరెడుసమయ మే తెంచె నని కుతుకమునఁ దేలుచు ని ట్లని సంభాషించు,

'గురుసుతా ! నీకోర్కెఁదీర్ప నేతెంచితి.'

అంగిరుఁడు—తల్లీ! మహారాజ్ఞీ ! నీ పీయర్థరాత్రిమున రాఁగ త మేమి?

మదనరేఖ—అలనాఁడు నీతోడ నే నొనర్చిన బాసకై .

అంగిరుఁడు—ఆసమయ మెట్టిది ?

మదనరేఖ—నీ స్నీవు వరియించి మదనకేలలఁ బడి మూర్ఛా గతుఁడవై నతతి మదీయకరకమలమున నీమేనిఁ దడపి పునర్జీవితు నొనర్చి నీయనుజ్ఞఁ గొని యింటికేగి రాజ పుత్రుఁ బరిణయమాడి యాతనిం గలియకమున్న నీమ నోరథముఁ దీర్చెద నని వెడలితి. నీకోర్కె నెఱవేర్చు కొని నను ఋణవిముక్తురాలినిగ నొనర్పుము.

అంగి—అవక్ర విక్రమముచే ననవద్యమగువిద్యచే ననన్యసామా
న్యములగు గుణములచే మంచిపేర్వడసిన తంత్రీభూపా
లున కనయంబు మేలుసేకూర్చు ప్రాణనాయకి వగు
నీమనోరథముఁ దీర్ప నీబాపఁడా ? ఆనాఁడు తెలిసియో
తెలియకనో వచించినదాని నేఁడు ద్రవ్వఁదగునే ?
కామమునకును సత్యమునకును నెక్కడి సంబంధము ?
నీ వీ గాఢాంధకారమున నిట కేతేరఁ బాడియగునా?
జననీ ! నీ మనోనాథుఁ డెట్లొప్పె ? జారత్వ మిహపర
ములకు దూరమని యెఱుఁగవా ?

మద—భూసురా ! ఇట్టిసుద్దు లెన్నాళ్ళనుండి నేర్చితివి ? పర
మేశ్వరుచే సృష్టింపఁబడిన భూతకోటికెల్ల నగ్రగణ్యుఁ
డగు మనుజుఁడే దబ్బఱలాడిన తక్కినవాటిగతి
యెయ్యది ? ఆ నాఁ డే నెన్ని యోనీతులు సెప్పినను
బెడచెవిం బెట్టి మూర్ఖత్వమున మూర్ఛవోయితి.
ఏ నీతోడ వచించిన తెఱఁగున మన్నాథుఁ బ్రార్థించి
యనుజ్ఞఁబడసి యీతావున కేతెంచితి. నాతో నిట్టి
ముగ్ధునివగిది మాటాడఁదగునే ? ఇంతలో నిన్ని
విద్దెల నెట్లు నేర్చితివి ? పంచేంద్రియములు జయించి
సన్న్యసాశ్రమము గైకొంటివా ? పురుషరూపమున
నున్న షండునివగిఁది గన్పట్టుచున్నాఁడవుగాని ప్ర
పంచజ్ఞానమునఁ బడతులకోర్కెలఁదీర్చు నవయౌవనా
కారుఁడవుగఁ గన్పింపవు. గురునందనా ! నాభర్త

ని న్నేమైన దండించు నని తలఁచితివా? వలదు వలదు. అతనికోర్కెపయి నే నిటు లేతెంచితి. భూసురా! పెక్కుమాటలు సెప్పక నీవాంఛవాపుకొని త్వరిత ముగ స న్నంపుము.

అంగీ——జననీ! సకలవిద్యాపారంగతుఁ డగు మజ్జనకుకడ విద్యలు నేర్చి సుగుణరాశి వని పేరెన్నికఁగన్న సహోదరి వగు ని న్నే గవిసిన ఘోరనరకమున కేగుదు. పెఱవారలు విన్న నవ్వుదురు. రాజులు తుచ్ఛుడ నని తూలనాడుదురు. కులమువారు గేలిసేతురు. నాకు తెలియక నిన్నఁడిగిన కోర్కెకి నీ సంపూర్ణకటాక్షవీక్షణముల సైరించి నను పావనుఁ జేయుము. నీమృదుమధుర వాక్యసరణి న న్నెంతయు యోగ్యుఁ గావించినది. నా మనోవాక్కాయములతో నుచ్చరించు నావాక్యముల నన్యవిధములఁ దలంపక నీపుత్రుగ బరిగణించి కాపాడుము. సర్వవిధముల నీకు మేలు సేకురుఁగాక! పోయి రమ్మని.

బ్రాహ్మణోత్తము డాయంగన సూనృతనిష్ఠ కెంతయు మెచ్చి యాపెకీర్తి యాచంద్రతారార్కముగ వెలయునట్లు దీవించియంప నాసుగుణమణి పరమసంతోషమున మార్గమధ్యముననున్న రక్కసునికడ కేగి క్షుద్బాధ వాపుకొను మని ప్రార్థింప నాక్రవ్యాదుం డాయువతిసత్యసంధతకు వెఱఁగొందుచు నాపెనిర్వికారభావంబుఁ బరికించి, 'పడఁతీ! నీశరీరంబుడస్సిన

ట్లగపడియెను. సౌకుమార్య ముట్టిడుపడుచుండు నీదు మేను తావిలేని పుష్పముచందమునను జిడుమఁబడిన మావిచి గురుమాదిరిని నాస్వాదముగొనని యమృతముఫక్కిని గాంతి విహీనముగఁ గన్పట్టెడు. గురునందనుఁ డతనిమనోరథంబు దీర్చుకొనకుండ నిన్నంపియుండునా? లేక యతఁ డెందేని వెడలిచిపోయెనా?' యని యడుగుడు నాపద్మగంధి యారక్కసునింజూచి విస్మయముట్టిపడుచుండఁ 'కర్బురా! నీయాజ్ఞఁ గొని యే మద్గురునందనుపాలికిం జని యాతనికోర్కిఁ దీఱుచుకొమ్మని ప్రార్థింప నాపండితపుత్త్రుఁడు ధర్మాయత్తచిత్తంబునను జననీభావంబునం దలఁచి యంపె నంతియెకాని నీవు చెప్పిన యంతరాయంబు లెయ్యవియు లేవు. నన్నీవు కరుణాళుండవయి బ్రాహ్మణునొద్ద కంపి ఋణవిముక్తింగనఁజేసితివి. ఇఁక పాపఫలము నిన్నంటదు. ననుఁ జంపి నీయాఁకలిఁ దీర్చుకొ'మ్మని పలుకుచుఁ బరిపూర్ణానందమున వానికడ కేగి నిలువంబడియె.

రక్కసుఁ డాయోషామణి వినయవిధేయతలకు గఁడుం గడు నచ్చెరువందుచు నాసుకుమారాకారంజంపఁ గరంబులు రాక యా పతివ్రతామణితో, 'తల్లీ! నీసుగుణపుంజముల కే మెచ్చితి. సత్యవాక్యపరిపాలనార్థమై యొకపాపపురక్కసునకశనముగ నేవాఁడు తనమేనిఁ గోల్పోవనెంచుశిఎన్ని ఘోరపాపకార్యము లొనర్చితియో యీతుచ్ఛరాక్షసుఁడుగ జన్మించితి! లోకమాతా! హేయమై మలమూత్రాదుల కాకర

మైన యీపాదుదేహమును బోషింప నెందఱెందఱు పతి వ్రతాశిరోమణుల నాపొట్టఁ బెట్టికొంటినోగదా? ఓ సవిత్రి! నీసుందరాకారమును వీక్షించుటచేతను నీమృదుమధురవాక్సు ధాధారను గ్రోలుటచేతను బరమపావనుఁడనైతి. నాయం ధకారము వాప భగవత్సాన్నిధ్యముకలిగె; నాయెఱుకతీఁగె సుడివడిపోకుండ నీవిమలవాక్యజాల మనెడు ప్రాఁకుచేతఁ బ్రోదిసేయు'మని ప్రార్థించుచు నాపతివ్రతాశిరోమణిపద పద్మముల వ్రాలెను.

మదనరేఖ వానిం బయికెత్తి, 'యన్నా! త్రికరణశుద్ధి గా నిజమువలుకుచు బంచేంద్రియముల జయించి జీవహింస మాని సర్వకాలసర్వావస్థలయందును బద్మపత్రాయతేక్షణ విరాజింతుడును గోటిమన్మథాకారుఁడును సర్వలోకసంరక్ష కుండును నగు మహావిష్ణువును ధ్యానింపుము. దనుజోత్తమా! రక్కసుఁడ నే నెట్లు భగవత్సాన్నిధ్యము బడయుదు నని చిం తింపకు. విష్ణుపదంబుఁ బొందుటకు సాత్త్వికగుణంబు ప్రధాన ముగాని కులముగాదు. అటులగుటంజేసియె కాదె యసురపుం గవులగు ప్రహ్లాదవిభీషణాదులు వైకుంఠప్రాప్తులగుట' యని పరమరహస్యము నుపదేశించి వెడల నయ్యసుర హరిచరణం బులు తనకుశరణ్యంబనియెంచి ఘోరతపంబొనరించి వైకుం ఠమున కేగెను.

ఆపతివ్రతాతిలకము తననాథుపాలికిం జని గురునందను విరక్తియు దనుజునిభక్తియు సవిస్తారముగఁ జెప్ప నతం డత్యా

ద్భుతరసనిమగ్నుం డయి తనయతివ సూనృతోక్తికిఁ బెక్కు తెఱఁగులఁ గొనియాడి చక్కఁగా గాఁపురముసేయుచు నతిథుల గారవించుచు నభ్యాగతులఁ బూజించుచు నెల్లప్రజలఁ దన కన్నబిడ్డలవలెఁ బోషింపుచుండ నొక్కనాఁ డాదంపతులకు, నేలోకరక్షకునిపదపద్మములఁ బవిత్రమగు గంగాదేవి పుట్టెనో యేమహాత్ముఁడు సాత్వికగుణప్రేరితుఁడయి వటపత్రమునఁ బరుండియున్నపుడు తన నాభికమలమున జతుర్ముఖుఁ డుద్భవించి పలుమాఱు ప్రపంచముల సృష్టించుచుండునో యేపరాత్పరుని యుదరగోళమున బదునాల్గులోకము లనవరతము వసించియుండునో, యేకరుణాళుఁడు భాగ్యరాశి యని మతికెక్కిన లచ్చిని యురమునఁ ధరించెనో, యేదీనజనపోషకుఁడు దనుజులగు ప్రహ్లాదవిభీషణాదులను సాధ్వులగు యనసూయాద్రౌపదులను సజ్జనులగు పంచపాండవులను రక్షించెనో, యట్టి మనోహరమంగహాసుఁడు బర్హిపింఛాలంకృతుఁడు ప్రభాన్వితనీలవర్ణదేహుఁడు పూజ్యనిధి పురుషోత్తముఁడు యఖిలభువనావనగుణభ్రాజిష్ణుం డగు శ్రీమన్మహావిష్ణుండు ప్రత్యక్షమయి మీసూనృతవ్రతనిష్ఠకే మెచ్చితి. వరంబు వేఁడుమన్న నినుఁగనుటచే నెల్లయుఁ బొందితిమని వారలువలుక సుఖంబున పెక్కేడులు వసియించి వైకుంఠమున కేతెం డని యనుజ్ఞనొసఁగి యప్పరంధాముఁ డదృశ్యుఁ డయ్యె. రాజదంపతులును సర్వసుఖములం బొంది యంత్యమున విష్ణుసాన్నిధ్యము నొందిరి.

ఓవిద్యాభిలాషీ! సనాతనసత్యనిష్ఠాగరిష్ఠులకు సత్యము చేదోడు వాదోడై యొకింత శ్రమగలిగించినను హరిశ్చందాద్రిదులకుంబలె ప్రతిష్ఠ సంఘటింపఁజేయును. స్త్రీయయ్యు మదనరేఖ యాడితప్పనిదై సత్యధర్మోపదేశమున గుఱుసందనాదులకు నీతిగఱపి మనకాచార్యకత్వమున నిలిచి మనమర్పించు బ్రహ్మాంజలుల కర్హురా లగుటఁ గంటివా?



